

ఇందులో :




15

15–5–49


# జనత

# అరుణరేఖ

## అమెరికన్ ప్రజాసాహిత్య సంచిక

★

మే 20వ తేదీకి వెలువడుతుంది

వెల: ఎనిమిదణాలు

★

కెనడా నుంచి దక్షిణ అమెరికా వరకూగల ప్రజానీకం వాంఛల్ని ప్రతిబింబించే ఉత్తమ అమెరికన్ సాహిత్యం.

★

అమెరికన్ సామ్రాజ్యవాదుల ఏలుబడిక్రింద నీగ్రో ప్రజానీకం అనుభవిస్తున్న యమయాతనలనూ, వారి పోరాట శక్తుల్నీ చిత్రించే నీగ్రో సాహిత్యం.

★

## ప్రముఖ రచయితలు

అప్టన్ సింక్లేర్ : జాక్ లండన్ : వాల్ట్ విట్‌మన్ : పాబ్లో నెరూడా : కెన్నెత్ పాచెన్ : మార్క్‌ట్వైన్ : లాయడ్ మలాన్ : కమింగ్స్ : గోర్కీ : ఇల్యా ఎహ్రెన్‌బర్గ్ : హోవర్డ్ ఫాస్ట్ : ఈరా వాలాక్ : కొడవటిగంటి కుటుంబరావు : డి. ఎ ఎ. ఎస్. నారాయణరావు : శ్రీ శ్రీ మొదలైనవారు

---

ప్రతులకూ వివరాలకూ వెంటనే వ్రాయండి:

మేనేజరు :: అరుణరేఖ :: కాపువీధి :: నెల్లూరు

జనత — 15-5-49

# శాంతి



ఈ
ఒక్కొక పేరు
మహోజ్వల తారకవలె
వినువీధిని
మిలమిల మిరుమిట్లు గొలుపు,

ఫ్రెంచి ప్రజాసమరంలో
నవజీవం విరజిమ్మిన
కవికోకిల 'ఆరగాన్',

పరమాణువు పరిశోధనలో
ప్రముఖులు 'క్యూరీ' దంపతులూ,

'అతివాస్తవ' వాదావృత
మహాపరిధి నధిగమించి
పరమావధి కమ్యూనిజానికి
ప్రస్థానం సాగించిన
కళావేత్త 'పికాసో'

తల నెరసిన వృద్ధమూర్తి
జ్ఞానమూర్తి 'రెడ్ డీన్ జాన్సన్'

ప్రగతి విరుద్ధ ప్రభుత్వం
కంటికి ఒక కంటకుడై
కనిపించిన 'హావర్డ్ ఫాస్ట్'

'అండ్ క్వైట్ ఫ్లోస్ ది డాన్'
మహాకవి 'షోలొఖోవ్'

ఉత్తమ కళాసృష్టికర్త
మహారచయిత 'ఫెడెయేవ్'

యాంటీనాజీ 'హెన్రిచ్ మేన్'

నాటకరచనాగ్రేసరు
ఐర్లండ్ 'ఒకేసీ'

వేటాడెడు పోలీసుల
విషదృష్టికి గంతగట్టి
అమెరికా 'అలకాపురి'లో
తిరుగాడు 'నెరూడా'

మన చైనా జనపూజిత
ప్రజాకవి 'కూవ్—మో—జో'

ఈ
మహాకవులు
కళావిదులు
శాస్త్రజ్ఞులు
ధర్మజ్ఞులు
ఒకే గొంతుకతో గర్జించిరి
ఒకేవాణి నినదించిరి
మ్రోగించిరి శాంతి నగారా
"శాంతి !"
"శాంతి !"
"శాంతి !"

అమెరికా ప్రేరేపిత
యుద్ధోన్మాదులకుట్రలు
ఒక్కొకటే కూలిపోవ
శాంతినగారా మ్రోగింది.

రక్తపిపాసిత 'జనరల్స్'
ఆగ్రహమును వెళ్ళగక్కారి,

వాల్‌స్ట్రీటు పెనుబ్రొరలు
ఉగ్రూతలు ఊగిపోయె,

టోరీ చర్చిల్ నాటిన
విషబీజా లొక్కొక్కటి
భయకంపితమై వాడిపోవ,

చెవరి బెదరి పలాయనం
చిత్తగించు తోడేళ్లను,

నడిచప్పుడు గాకుండా
తోకముడిచి బొరియల్లో
జొరబడు సరీసృపాలను,

తన తొత్తుల
మతగురువుల
స్పెషలు బ్రాంచి పోలీసుల
రౌడీలను
కేడీలను
'జోహుకుం' 'చిత్తం'గాళ్ళను
వెనువెంటనె ఆజ్ఞాపించిరి

"చూ ష ం డి క మ న శ క్తి"

శాంత్యభ్యుదయాలను
కాంక్షించే స్త్రీపురుషుల
కమ్యూనిస్టుల
ద్రోహులుగా చిత్రించిరి,
అబద్ధాల కార్ఖానా
నిర్మించిరి,

ఎటుజూచిన
ఎటుసాగిన
పెనుసీడలు పెన్నాడినవి,

లాఠీలు తుపాకులు చె
ల్లాటం సాగించినవి,

చెరసాలలు నోర్లు తెరచి
ఇనుపనాల్కలు సాచినవి,

బూతులమాటలు చెవిలో
గింగురుమని మార్మ్రోగినవి,

టియర్ గ్యాసు నడివీధిని
ట్రాఫిక్ నరికట్టింది.

శాంతిని కోరేదెవరో!
యుద్ధానికి సన్నాహం
చేసేదెవ రెవరో!
ప్రపంచం పరికించింది
చరిత్ర నిర్ణయించింది.

ప్రపంచం నలుమూలల
ప్రతినిధులేతెంచిరి,
ప్యారిస్ శాంతి మహాసభలో

అరవైకోట్ల ప్రజావాణి
పిడుగై గర్జించింది.

యుద్ధానికి బలియైపోయిన
గృహములేని గృహస్థులూ,
పతుల్లేని సతీమణులూ'
తలిదండ్రుల గోల్పోయిన
అనాథ సంతానం,
ఒడిలో కిలకిలలాడెడు
తమ బిడ్డల గోలుపోయి
విలపించెడు తలిదండ్రులు,

వీరే
వీరే స్వతంత్రవీరులు
వీరే యుద్ధోన్మదవర్గానికి
బుద్ధిజెప్పు మహారథులు,
ఫాసిస్టు మృగానికి
సమాధి నిర్మాతలు.

రెండు ప్రపంచాలు
రెండే రెండు శిబిరాలు

అటు ట్రూమన్, అట్లీ, క్వెల్లీ,
గాస్పరీ, నెహ్రూ, ఫ్రాంకో,
యోషిడా, వాటికన్, ల్యూన్,

ఇటు కులమత వర్ణవిభేదం
లేని స్వతంత్ర స్వేచ్ఛాధాత్రి.

అటు యాటంబాంబులకూ
అట్లాంటిక్ సంధులకూ

అనాథ స్త్రీ శిశువులకూ
అకాల మరణ ప్రాప్తికి
ఉన్మత్తప్రయత్నం
సాగుతోంది.

ఇటు నవనవోన్మేషితమూ
ఒక నూత్నసమాజం ఉదయిస్తోంది.
నవసంస్కృతి
వికసిస్తోంది.

అటు శాంతినిరోధక ధనికులు
ఇటు శాంతికాముక శ్రమజీవులు

అది నిర్యాణం
ఇది నిర్మాణం
అది మరణం
ఇది జననం

ఓ
యుద్ధోన్మాదకులారా !
మృత్యు నిమంత్రితులారా !
ఆయుధబలముందని
ప్రేలుచునున్నారా !

శాంతి శిబిరమొక మహాసముద్రమై
అభంగ భంగముల ముంచేస్తుంది.

ఉత్తుంగ హిమాలయ శృంగంబై
మీపై విరుచుక పడుతోంది !

చైనా ఇందుకు తార్కాణం
చైనా మీకొక గుణపాఠం

ప్రజాశక్తి జంగ్ కైషేకును
పదవీ భ్రష్టుని చేసింది.

ప్రజాశక్తి డాలర్ స్రమాట్
కబంధహస్తం నరికింది.

ఫ్యూడలిజం దోపిడిచే
నిర్జీవప్రాయమైన
అఖిలేష్యాఖండానికి
ప్రజాశక్తి
ప్రచండశక్తి
నవజీవం పోసింది.
శ్మశానభూమి నతిసుందర
నందన వనిగా మార్చేస్తుంది:

ఈ
విశాల భూచక్రానికి
అందెవేసిన మేధావులు
ప్రపంచ ప్రతిభావంతులు
మహోన్నత విశాలహృదయులు
ఏప్రిల్ నెల
ఇరవై తేదీ
ప్యారిస్ నగరంలో
ప్రమోగించిన శాంతినగారా
జయగీతం పాడింది.

అది
యుద్ధోన్మద వర్గానికి
చిరసమాధి.
అది ఫాసిస్టుమృగాలకు
భరతవాక్యం.

[చైనాకవి మాఫాంటో పద్యానికి అనువాదం: వాసిరెడ్డి]

౧

# మార్క్సిజం రాజ్యాంగ యంత్రం



—లెనిన్

"ఈనాడు నాగరిక దేశాలన్నింటిలోను పెట్టుబడిదారీ సమాజం ఉంది. ఈ సమాజం కొంచెం హెచ్చుతగ్గులుగానైనా మధ్యయుగపు లక్షణాలనుంచి విముక్తి చెందడం, ఆయాదేశాల ప్రత్యేక చారిత్రకాభివృద్ధి కనుగుణంగా రూపొందడం జరిగింది. తర తమ భేదాలతో యీ సమాజం అన్ని నాగరిక దేశాల్లోను అభివృద్ధి చెందింది. అంతేకాకుండా 'నేటి రాజ్యాంగయంత్రం'లో దేశదేశానికి మార్పులున్నాయి. స్విట్జర్లాండులో ఉన్న ప్రభుత్వం ప్రషో్న(ప్రష్యన్) జర్మన్ సామ్రాజ్యానికి విభిన్నమైనది. అమెరికాలోఉన్న ప్రభుత్వ యంత్రానికి బ్రిటన్‌లోఉన్న ప్రభుత్వానికీ తేడాఉంది. కాబట్టి 'నేటి రాజ్యాంగ యంత్రం' ఒక కల్పన మాత్రమే.

"విభిన్న నాగరిక దేశాల్లో విభిన్నరాజ్యాంగ యంత్రాలు ఉన్నప్పటికీ వాటిస్వరూపాల్లో అనేక వైవిధ్యాలున్నప్పటికీ, వాటన్నిటిలోనూ ఒకే సమానగుణం ఉంది. అభివృద్ధిలో తరతమ డిగ్రీల భేదాలున్నప్పటికీ అవన్నీ ప్రస్తుత పెట్టుబడిదారీ సమాజం పైనే ఆధారపడి ఉన్నాయి. కాబట్టి వాటిలో అనేక సమాన లక్షణాలుకూడా ఉంటాయి. అందువల్ల ఈ సమాన లక్షణాల నాధారంగా తీసుకొంటే భావిసమాజానికి ప్రస్తుత రాజ్యాంగ యంత్రా

నికీ ఉండే తేడాను గురించి మాట్లాడడం సాధ్యం అవుతుంది. భావిసమాజానికి ప్రస్తుత పునాది అయిన బూర్జువా సమాజం భవిష్యత్తులో అంతరించిపోతుంది.

"అయితే కమ్యూనిస్టు సమాజంలో రాజ్యాంగ యంత్రం ఏవిధంగా మార్పు చెందుతుంది? అనే ప్రశ్న ఉదయిస్తుంది. నేటి రాజ్యాంగ యంత్రానికి సంబంధించిన కార్యకలాపాలను పోలిన ఏయే సాంఘిక కార్యకలాపాలు ఆనాడు ఇంకా మిగిలి ఉంటాయి? ఈ ప్రశ్నకు మనం శాస్త్రీయంగా సమాధానం చెప్పాలంటే రాజ్యాంగ యంత్రం (స్టేట్) అనే శబ్దాన్ని 'ప్రజ' అనే శబ్దానికి ముడిబెట్టడంవల్ల సమస్య పరిష్కారం కాదు. అది ఇంకా గందరగోళానికి దారితీస్తుంది."

ఈ విధంగా "ప్రజా ప్రభుత్వం"అని చెప్పి గొంతు చించుకునేవాళ్ళ బండారాన్ని బైటబెడుతూ ఈ ప్రశ్నకు సరియైన సమాధానం ఇవ్వాలంటే శాస్త్రీయ సిద్ధాంతంపైనే ఆధారపడాలని మార్క్స మనలను హెచ్చరించాడు.

శాస్త్రీయ విజ్ఞానం సాధించిన-పరిణామ సిద్ధాంతం ద్వారా కాచి వడబోసి నిగ్గుదేర్చిన - అసలు ప్రథమ సత్యాన్ని - కేపిటలిజం నుంచి కమ్యూనిజానికి మారేదశలో చారిత్రాత్మకంగా మధ్యన ఒక ప్రత్యేక దశ ఉటుంది అనే పరమసత్యాన్ని - ఊహావాదులు (యుటోపియన్లు) మరచిపోయ్యారు. సోషలిస్టు విప్లవం అంటే హడలిపోయే నేటి అవకాశవాదులు కూడా దీన్ని పూర్తిగా మరచిపోయారు.

ఈ సందర్భంలో మార్క్స ఇలా చెప్పాడు.

"కేపిటలిస్టు, కమ్యూనిస్టు సమాజాలమధ్య విప్లవాత్మకమైన మార్పుజరిగే ఒకవిప్లవదశ ఉంటుంది. ఈపరివర్తనకు సంబంధించిన రాజకీయదశలో రాజ్యాంగయంత్రం. శ్రామికవర్గ విప్లవాత్మక నియంతృత్వరూపంలోనే ఉంటుంది. మరోరూపంలో ఉండదు."

ప్రస్తుత పెట్టుబడిదారీ సమాజంలో శ్రామికవర్గం నిర్వహించిన పాత్రనుబట్టి శ్రామికవర్గంయొక్క, పెట్టుబడిదారీవర్గంయొక్క పరస్పర బద్ధవిరుద్ధ ప్రయోజనాలనుబట్టి మార్క్సు పై విధంగా నిర్ణయించాడు.

ఇంతకుపూర్వం ఈ సమస్యనుగురించి ఈ క్రిందివిధంగా చెప్ప బడేది.

"శ్రామికవర్గం తన విముక్తిని సాధించేందుకు బూర్జువా వర్గాన్ని కూలద్రోసి రాజకీయాధికారాన్ని హస్తగతం చేసుకొని శ్రామికవర్గ విప్లవ నియంతృత్వాన్ని నెలకొల్పాలి."

పై జెప్పినదానికి కొంచెం భిన్నంగా ఇప్పుడీవిధంగా చెప్ప బడుతూ ఉంది.

"కమ్యూనిజంవైపు అభివృద్ధి చెందుతూవున్న పెట్టుబడిదారీ సమాజం 'రాజకీయ పరివర్తన దశ' లేకుండా కమ్యూనిస్టు సమాజంలోనికి మారడం అసంభవం. ఈ 'రాజకీయ పరివర్తన దశ' లో ఉండే రాజ్యాంగయంత్రం (స్టేటు) శ్రామికవర్గ విప్లవాత్మక నియంతృత్వామే అయిఉంటుంది."

అయితే ఈ నియంతృత్వానికి ప్రజాస్వామికంతో ఉండే సంబంధ మేమిటి?

'కమ్యూనిస్టు మానిఫెస్టో' లో దీనికి సంబంధించిన రెండు విషయాలు ఒకదానివెంట ఒకటి ఉన్నాయి (1) 'పాలకవర్గ స్థానానికి శ్రామిక వర్గాన్ని కొనిపోవడం' (2) 'ప్రజాస్వామిక పోరాటాన్ని జయించడం' కేపిటలిజం నుంచి కమ్యూనిజానికి ప్రజాతంత్రం ఏవిధంగా మార్పు చెందుతుందో పైజెప్పిన విషయాలపై ఆధారపడి ఖచ్చితంగా నిర్ణయించడం సాధ్యమవుతుంది.

పెట్టుబడిదారీ సమాజంలో ఆ సమాజం అభివృద్ధి చెందడానికి చాలా అనుకూల పరిస్థితులున్న సమయంలో, ప్రజాస్వామిక రిపబ్లిక్కుల్లో దాదాపు సంపూర్ణ ప్రజాస్వామికం ఉంటుంది, కాని ఈ సంపూర్ణ ప్రజాస్వామికం ఎప్పుడూ పెట్టుబడిదారీ దోపిడికి సంబంధించిన సంకుచిత హద్దులవరకే పరిమితం అవుతుంది. పెట్టుబడిదారీ సమాజంలో ప్రజాస్వామికానికి ఈ గతి పట్టక తప్పదు. ఇది నిజానికి కొద్ది మంది పెట్టుబడిదారుల - ధనికుల - ప్రజాస్వామికం మాత్రమే. పెట్టుబడిదారీ సమాజంలో ఉండే స్వాతంత్ర్యం పురాతన గ్రీకు రిపబ్లిక్కుల్లోని స్వాతంత్ర్యంలాగే ఉంటుంది.

గ్రీకు రిపబ్లిక్కుల్లో ఆనాడు బానిసల యజమానులకు మాత్రమే స్వాతంత్ర్యం ఉండేది. పెట్టుబడిదారీ దోపిడీ పరిస్థితుల ఫలితంగా దారిద్ర్యంచే క్రుంగిపోతూఉన్న కార్మికులకు (వేజ్ స్లేవ్స్) "ప్రజాస్వామికం గొడవబట్టదు," "రాజకీయాల గొడవబట్టదు." సాధారణ శాంతిపరిస్థితుల్లో సాంఘిక రాజకీయ జీవితంలో పాల్గొనకుండా బహుసంఖ్యాక ప్రజలను దూరంచేయడం జరుగుతుంది.

పై జెప్పిన విషయం ఎంత సత్యసంగతమో జర్మనీ చరిత్ర చూస్తే స్పష్టంగా కండ్లకుగట్టినట్లు బోధపడుతుంది. ఎందుకంటే జర్మనీలో చట్టబద్ధ రాజ్యాంగ విధానం (కాన్స్టిట్యూషనల్ లీగాలిటి) చాలాకాలంవరకు- దాదాపు అర్ధశతాబ్దంవరకు (1871—1914) పని చేసింది. ఇతరదేశాలన్నిటికంటె జర్మనీలోఉన్న సోషల్ డిమోక్రాట్లు ఈ కాలంలో చట్టబద్ధ బహిరంగావకాశాలను ఎక్కువగా ఉపయోగించుకో గలిగారు. ప్రపంచంలోఉన్న అన్నిదేశాలకంటె వారు జర్మనీ కార్మికుల్లో అధిక సంఖ్యాకులను రాజకీయ పార్టీలోకి సంఘటిత పరచగలిగారు.

ఎంత ఎక్కువగా సంఘటిత పరిచినా మొత్తం ఒకకోటి 50 లక్షల కార్మికుల్లో 30 లక్షలమంది ట్రేడ్‌యూనియన్ కార్మికులూ, 10 లక్షలమంది సోషల్ డిమాక్రటిక్‌పార్టీ సభ్యులు మాత్రమే ఉండేవారు. పెట్టుబడిదారీ సమాజంలో ఎక్కువ రాజకీయచైతన్యంగలిగి క్రియాశీలురైన ఈ జర్మనీ కార్మికులస్థితిమాత్రం ఏమిటి? పెట్టుబడిదారీ సమాజంలో అత్యల్ప సంఖ్యాకులుగా ఉన్న బహుకొద్దిమందికి—ధనికులకు - మాత్రమే ప్రజాస్వామికం. పెట్టుబడిదారీ ప్రజాతంత్ర విధానాన్ని మనం ఇంకా సూక్ష్మంగా పరిశీలించినట్లయితే స్వల్పవిషయాలని చెప్పబడే ప్రతి చిన్నవిషయాల్లోనూ — ఎన్నికల వివరాల్లోగానీ (నివేశన యోగ్యతలూ, ఎన్నికల జాబితాల్లో స్త్రీలను మినహాయించడం వగైరా) ప్రాతినిధ్యసంస్థలు ఏర్పడే విధానంలోగానీ, సభాసమావేశాల హక్కు నరికట్టే ప్రత్యక్ష ప్రతిబంధకాల్లోగానీ (పబ్లిక్ భవనాలు 'బికారీ'ల ఉపయోగంకోసంకాదు.) అచ్చంగా పెట్టుబడిదారులచే నెలకొల్పబడి వాళ్ళకోసమే నడపబడే దినపత్రికలు వగైరా విషయాల్లోగానీ - ప్రజాస్వామికంమీద ఆంక్షపై

అంతే ఏ విధంగా ప్రయోగించబడుతుందో మనం చూస్తున్నాం. పేదలపై ప్రయోగించబడే ఈ ఆంక్షలూ ఈ పరిమితులూ, ఈ మినహాయింపులూ, ఈ ప్రతిబంధకాలూ వారిదృష్టిలో – ముఖ్యంగా దారిద్ర్యం అంటే ఏమిటో ఎరగని, అణచబడినవర్గాలతో ఎన్నడూ ఎటువంటి సన్నిహిత సంబంధం లేని వారిదృష్టిలో – (బూర్జువా ప్రచారకుల్లో బూర్జువా రాజకీయనాయకుల్లో నూటికి 99 మంది కాకపోయినా కనీసం నూటికి 90 మంది అయినా ఇలాంటివాళ్ళే) – ఇవన్నీ స్వల్ప విషయాలుగానే కనిపిస్తాయి. కాని మొత్తం ఈ ఆంక్షలన్నీ కలిసి పేద ప్రజానీకాన్ని రాజకీయాలనుంచి దూరంచేస్తాయి. ప్రజాస్వామికంలో చురుకుగా పాల్గొనకుండా వారిని అరికడతాయి.

బూర్జువా ప్రజాస్వామికం యొక్క బూటకత్వాన్ని మార్క్సు అద్భుతంగా కనిపెట్టాడు. కాబట్టే ప్యారిస్ కమ్యూన్ అనుభవాలను వివరిస్తూ మార్క్సు ఇలా అన్నాడు.

"తమను అణగద్రొక్కే వర్గంలోనుంచి ఏయే ప్రతినిధులు పార్లమెంటులో తమకు ప్రాతినిధ్యం వహించాలో తమను అణచి వేయాలో, నిర్ణయించుకోడానికి కొన్ని సంవత్సరాల కొకసారి అణచబడిన ప్రజలకు అవకాశం ఇవ్వబడుతుంది."

ఈ బూర్జువా ప్రజాస్వామికం సంకుచితంగా ఉండక తప్పదు. పేద ప్రజలను దారుణంగా అణచివేస్తుంది. కాబట్టి ఇది కేవలం మోసం. దగా. వట్టి బూటకం. బూర్జువా ఉదారవాదులూ, వాళ్ళ ప్రచారకులు, పెటీ బూర్జువా అవకాశవాదులూ, పెట్టుబడిదారీ ప్రజా స్వామికం ముందుకు సాగిపోతుందని, అభివృద్ధి చెందుతుందని ప్రచారం చేస్తున్నారు.

ఆవిధంగా మనలను నమ్మించ జూస్తున్నారు. కాని వాళ్లు చెప్పి నట్లుగా కేపిటలిస్టు ప్రజాస్వామికం సుగమంగా, సూటీగా సాఫీగా ఇంకా ఎక్కువ ప్రజాస్వామికం వైపు సాగిపోదు. అభివృద్ధి చెందదు. పురోభి వృద్ధి – అంటే కమ్యూనిజంవైపు పురోగమనం – శ్రామికవర్గ నియం తృత్వం ద్వారానే జరుగుతుంది. అంతేకాని మరోవిధంగా జరగడానికి వీల్లేదు. మరోవిధంగా మరెవరూ పెట్టుబడిదారీ దోపిడీగాండ్ల ప్రతి ఘటనను భగ్నం చేయలేరు.

శ్రామికవర్గ నియంతృత్వం - పీడక వర్గాన్ని అణచివేయడం కోసం పీడితప్రజల అగ్రగామిదళం అయిన శ్రామికవర్గం పరిపాలక వర్గంగా సంఘటితం కావడం-అంటే కేవలం 'ప్రజాస్వామిక విస్తరణ మాత్రమే కాదు. అది ఒక బ్రహ్మాండమైన విస్తృత ప్రజాస్వామికం. మొట్టమొదటిసారిగా ప్రజలకు సంబంధించిన నిజమైన ప్రజాస్వామికం. అది ధనికులకు ప్రజాస్వామికం కాదు. పీడకులపై దోపిడీగాండ్లపై, పెట్టుబడిదారుల స్వాతంత్ర్యంపై శ్రామిక నియంతృత్వం అనేక ఆంక్షలు విధించి వారి ఆటలు అరికడుతుంది. సమస్త మానవజాతిని దాస్యంనుంచి బానిసత్వంనుంచి విముక్తి చేసేందుకు మనం వారిని తప్పకుండా అణచివేయాలి. వాళ్ళ ప్రతిఘటనను బలప్రయోగంతో భగ్నంచేయాలి. నిర్బంధమూ, దమనమూ ఉన్నచోట స్వాతంత్ర్యమూ లేదు. ప్రజాస్వామికమూ లేదు.

బెబెల్‌కు వ్రాసిన ఉత్తరంలో ఎంగిల్స్ ఈ విషయాన్ని గురించి బహుచక్కగా వ్యక్తీకరించాడు:

"శ్రామికవర్గం ఇంకా ప్రభుత్వ యంత్రాన్ని ఉపయోగిస్తున్నంతకాలం, స్వాతంత్ర్య ప్రయోజనంకోసం ఆవర్గం దాన్ని ఉపయోగించదు. తన ప్రతికూలుర ఆటలను అరికట్టడానికే ఆవర్గం ప్రభుత్వయంత్రాన్ని ఉపయోగిస్తుంది. స్వాతంత్ర్యాన్ని గురించి మాట్లాడడానికి సాధ్యమైన వెనువెంటనే అసలు ప్రభుత్వ యంత్రంయొక్క అస్తిత్వమే లేకుండా పోతుంది."

అత్యధిక సంఖ్యాకులైన ప్రజాసామాన్యానికి ప్రజాస్వామికం, అత్యల్ప సంఖ్యాకులైన కొద్దిమంది పెట్టుబడిదారీ దోపిడీగాండ్లను ప్రజాపీడకులను బలప్రయోగంతో అణచివేయడం, అంటే వాళ్ళను ప్రజాస్వామికం నుంచి మినహాయించడం ఇదే కేపిటలిజం నుంచి కమ్యూనిజానికి ప్రజాస్వామికం పరివర్తనం చెందేదశలో వచ్చేమార్పు.

కమ్యూనిస్టు సమాజంలో మాత్రమే ప్రభుత్వ యంత్రం యొక్క అస్తిత్వంకూడా లేకుండా పోతుంది. ఎందుకంటే కమ్యూనిస్టు సమాజంలో పెట్టుబడిదారుల ప్రతిఘటన పూర్తిగా భగ్నమైపోతుంది. పెట్టుబడిదారు లనేవాళ్ళు ఆనాడు ఉండనే ఉండరు. వర్గాలుండవు. (సాంఘిక ఉత్పత్తిసాధనాల సంబంధాల్లో సమాజంలోఉన్న వివిధ

వ్యక్తులమధ్య భేదమేమీ ఉండదు.) అప్పుడుమాత్రమే - ఆదశలో మాత్రమే - స్వాతంత్ర్యాన్నిగురించి మాట్లాడడం సాధ్యమవుతుంది. అప్పుడుమాత్రమే నిజమైన సంపూర్ణ ప్రజాస్వామికం - ఎట్టిమినహాయింపులూలేని ప్రజాస్వామికం - సాధ్యమవుతుంది. గుర్తించబడుతుంది. అప్పుడుమాత్రమే - అవును అప్పుడుమాత్రమే - ప్రజాస్వామికం అదృశ్యమైపోవడం ప్రారంభమవుతుంది. పెట్టుబడిదారీ దాస్యంనుంచీ దోపిడినుంచీ వర్ణనాతీతమైన బీభత్సాలనుంచీ మృగప్రాయదశనుంచీ అసంగతాలనుంచీ, అప్రఖ్యాతినుంచీ విముక్తి చెందటమే ఇందుకు సహజకారణం. శతాబ్దాల తరబడినుంచీ చిరపరిచితమైన, సహస్రాబ్దాల తరబడినుంచీ కాపీబుక్కుల్లో ఒరవడిబెట్టిన, సాంఘిక అంతర్వ్యవహారాలకు సంబంధించిన ప్రాథమిక నీతిసూత్రాలను ఆచరించడానికి ప్రజ క్రమంగా అలవడిపోతారు. ఎటువంటి బలప్రయోగంతో అవసరంలేకుండా, నిర్బంధంలేకుండా, లొంగుబాటుతత్వం లేకుండా బలప్రయోగాని కవసరమైన ఎటువంటి ప్రత్యేకయంత్రం - అనగా ప్రభుత్వయంత్రం - లేకుండానే ప్రజలు ఎవళ్ళ విధులు వాళ్ళు నిర్వహిస్తారు. ఆవిధంగా అలవాటైపోతారు.

ప్రభుత్వ యంత్రం రాలిపోతుంది, అని చక్కగా వ్యక్తీకరించబడింది. ఎందుకనగా 'రాలిపోవడం' (విదర్స్ ఎవే) అనే మాట క్రమానుగతినీ ఆకస్మిక స్వభావాన్నికూడా సూచిస్తుంది. అలవాటు మాత్రమే అలాంటిపని చేయగలుగుతుంది. నిస్సందేహంగా చేస్తుంది కూడా. సాంఘిక అంతర్వ్యవహారాలకు సంబంధించిన నియమాలను పాటించడంలో ప్రజలెంత త్వరగా వాటికి అలవాటు పడిపోతారో మనం లక్షలసార్లు చూస్తూనే ఉన్నాం. దోపిడిలేకుండా పోయినప్పుడు, ఆగ్రహానికి, ఆవేశానికి, తిరుగుబాటుకు కారణభూతమైనదేదీ లేనప్పుడు 'అణచివేసే' అవసరం అంటూ లేనేలేదు.

పెట్టుబడిదారీ సమాజంలోని ప్రజాస్వామికం అత్యంత సంకుచితంగానూ, పరమ దౌర్భాగ్యంగానూ, వట్టి బూటకంగానూ ఉంటుంది. ధనికులకు - బహు కొద్దిమందికి - మాత్రమే అది ప్రజాస్వామికం. కాని శ్రామిక నియంతృత్వం (కమ్యూనిజానికి పరివర్తన దశ) దోపిడిగాండ్లు అయిన కొద్దిమందిని తప్పకుండా అణచివేయడం

తో పాటు మొట్టమొదటిసారిగా ప్రజలకోసం - బహు సంఖ్యాక ప్రజల కోసం - ప్రజాతంత్రాన్ని ఏర్పరుస్తుంది. ఒక్క కమ్యూనిజం మాత్రమే నిజమైన పరిపూర్ణ ప్రజాస్వాతంత్ర్యాన్ని ప్రసాదించగలుగు తుంది. ప్రజాతంత్రం పరిపూర్ణమైనకొలదీ అసలు దాని అవసరమే లేకుండా పోయి ప్రభుత్వయంత్రం దానంతట అదే రాలిపోతుంది.

దీన్నే మరో మాటల్లో చెప్పాలంటే పెట్టుబడిదారీ విధానంలో ప్రభుత్వ యంత్రం—ఆ మాటకు సరియైన అర్థంలో అనగా ఒక వర్గాన్ని మరో వర్గం అణచివేయడానికి, మెజారిటీ మైనారిటీని అణచివేయ డానికి, ఒక ప్రత్యేక యంత్రం - ఉంటుంది. బహు సంఖ్యాక పీడిత ప్రజలను అత్యల్పసంఖ్యాకులైన దోపిడీదార్లు అణచివేయాలంటే- ఆ పనిని సఫలీకృతంగా నెరవేర్చేందుకు ఘోరాతిఘోరమైన బీభత్సమూ, పశుత్వమూ ఆ దోపిడీముఠాకు సహజమే అవుతుంది. మానవజాతిని దాస్యంలో, బానిసత్వంలో, కూలిపనిలో అట్టిపెట్టడానికి వాళ్ళు రక్తపుటేరులను ప్రవహింపచేస్తారు.

కేపిటలిజంనుంచి కమ్యూనిజానికి మారే పరివర్తన దశలో కూడా 'అణచివేయడం, అవసరమే' అవుతుంది. కాని అప్పుడత్యధిక సంఖ్యాకులైన పీడితప్రజలు అత్యల్పసంఖ్యాకులైన దోపిడీగాండ్లను అణచివేయడం జరుగుతుంది. ఒక ప్రత్యేక యంత్రం - అణచివేయ డానికొక ప్రత్యేకయంత్రం - ఆదశలోకూడా అవసరమే. కాని అది పరివర్తనదశలో మార్పుచెందుతూ ఉండే ప్రభుత్వ యంత్రం మాత్రమే. ఆ మాటకు సరియైన అర్థంలో అసలది ఒక ప్రభుత్వ యంత్రమే కాదు. ఎందుకంటే నిన్నటిదాకా కూలీలుగా ఉన్న అధిక సంఖ్యాక ప్రజలు కొద్దిమంది దోపిడీగాండ్లను అణచివేయడం అంత కష్టమైనపనిగాదు. ఆ అణచివేయడం పెట్టుబడిదారీ విధానంలో అణచివేయడంకంటె తేలికగా, సాఫీగా, సహజంగా జరుగుతుంది. బానిసలూ దాసులూ కూలీలు చేసే తిరుగుబాటుల నణచివేయడంలో జరిగే రక్తపాతంకంటె చాలా తక్కువ రక్తపాతంతోనే అది సాధ్యమవుతుంది. ఈవిధంగా అత్యధిక సంఖ్యాక ప్రజలవరకు ప్రజాస్వామిక విస్తరణ జరగడంతోపాటు అణచివేసే ఒక ప్రత్యేక యంత్రంయొక్క ఆవశ్యకత అదృశ్యమై పోవడం మొదలిడుతుంది. ప్రజాసామాన్యాన్ని

అణచివేయడానికి ఒక జటిలమైన యంత్రం లేకుండా ఆపనిని దోపిడి వర్గం నెరవేర్చలేకపోవడం సహజమే కాని అతిసాధారణమైన 'యంత్రం' తోనే, దాదాపు ఎటువంటి యంత్రమూ, ప్రత్యేక యంత్రమూ లేకుండానే, 'సాయుధ ప్రజల' అతి సాధారణమైన 'సంఘటన' ద్వారానే ప్రజాసామాన్యం (సోల్జర్స డిప్యూటీలూ, వర్కర్ల సోవియట్ లాంటివి) దోపిడిముఠాను అణచివేయగలుగుతుంది.

అణచివేయబడేవాళ్ళు 'ఎవరూ' లేకపోవడంచేత – వర్గంఅనే అర్థంలో 'ఎవరూ' లేకపోవడంచేత. ప్రజల్లో ఒక ప్రత్యేకభాగానికి వ్యతిరేకంగా క్రమబద్ధ పద్ధతిపై సాగించే పోరాటం అనేఅర్థంలో 'ఎవరూ' లేకపోవడంచేత – చివరకు ఒక కమ్యూనిజం మాత్రమే ప్రభుత్వ యంత్రాన్ని పూర్తిగా అనవసరంగా చేస్తుంది. మనం వట్టి ఊహావాదులంకాదు. కొందరు వ్యక్తులు హద్దులనుదాటి వ్యవహరించడం, అలాంటి వ్యవహారాలను అణచివేయడం సంభవమనీ, తప్పనిసరి అనీ మనం అంగీకరిస్తాం. యథార్థవిషయాన్ని మనమెప్పుడూ కాదనం. కాని ఇందుకోసమని ఒక ప్రత్యేకప్రభుత్వ యంత్రంగానీ, అణచివేయడంకోసం ఒక ప్రత్యేక విధానంగాని అవసరంలేదు. నాగరిక ప్రజాసంఘంలాగా సాయుధప్రజలే ఇలాంటివాటిని అతి సాధారణంగా త్వరితంగా అరికడతారు. ఉదాహరణకు ఈ నాటి సమాజాన్నితీసుకున్నా పరస్పరం పోరాడుతూన్న ఇద్దరువ్యక్తులూ, ఉభయ పార్టీలూ మధ్యన స్త్రీకి ఎవరికైనా దెబ్బలు తగలేసమయంలో ఉభయులూ కలిసి జోక్యం కలిగించుకోడం మనం చూస్తూనే ఉన్నాం. అదీగాక ఈ అధికప్రవర్తనలకూ, ఈ అత్యాచారాలకూ మూలమైన అసలు సాంఘిక కారణమేదో మనం ఎరుగుదుం. సాంఘిక అంతర్వ్యవహారాలనూ సాంఘిక మర్యాదలనూ ఉల్లంఘించడానికి దోపిడీ దారిద్ర్యాలే మూలకారణం. ఈ ప్రధానకారణాన్ని తొలగించడంతో పాటే అత్యాచారాలుకూడా 'ఎగిరిపోవడం' ప్రారంభం అవుతుంది. అవి ఏవిధంగా ఎంతత్వరగా ఎగిరిపోతాయి అనేది మనకు తెలియదు. కాని అవి తప్పకుండా 'ఎగిరిపోతాయి' అని మనమెరుగుదుం. అవి ఎగిరిపోవడంతోపాటే ప్రభుత్వయంత్రంకూడా ఎగిరిపోతుంది.

— 'స్టేట్ అండ్ రివల్యూషన్' నుండి

# భారతరాజ్యాంగ పరిషత్తు

## ధనికవర్గప్రతినిధుల గూడు

## 1. రాజ్యాంగ నిర్మాతలు

భారత పరిపాలక వర్గం తయారుచేసి దిద్దితీర్చిన రాజ్యాంగచట్టాన్ని రాజ్యాంగ పరిషత్తు ఆమోదించబోతూ ఉంది.

అసలీ రాజ్యాంగ చట్టాన్ని తయారు చేసిన ఆ మహాసర్మాతలెవరు? పల్లెల్లో ఉండే కోట్లకొలది పేదరైతులూ బస్తీల్లో ఉండే లక్షలకొలది కార్మికులూ, వేలకొలది వీరసైనికులూ, వీరనాయికులూ, అసంఖ్యాక స్త్రీ పురుషులూ అనేకకష్టనష్టాలను సహించి, తమ రక్తాన్ని ధారవోసి, తమ ప్రాణాలను సమర్పించి భారతీయ స్వాతంత్ర్య పోరాటాన్ని దిగ్విజయంగా కొనసాగించారు. కాని ఈనాడు భారత రాజ్యాంగ స్వరూపాన్ని దిద్దితీర్చేది ఈ సామాన్య ప్రజానీకమేనా? వీరి ప్రతినిధివర్గమేనా?

కాదు! ప్రజాసామాన్యానికి- నూటికి 87 మందిగా ఉన్న సామాన్యప్రజలకు - ఈ రాజ్యాంగనిర్మాణంతో ఎట్టి సంబంధం లేదు. నూటికి పదముగ్గురికి మాత్రమే- అనగా ఉన్నత వర్గానికి మాత్రమే-ప్రాతినిధ్యం వహించే సభ్యులే ఈ రాజ్యాంగ పరిషత్తులో పాల్గొంటున్నారు. ఈ ధనిక వర్గ ప్రతినిధులు తయారుచేసిన రాజ్యాంగ చట్టాన్నే ప్రజాసామాన్యంపై బలాత్కారంగా రుద్దడం జరుగుతుంది.

### రాజ్యాంగ పరిషత్తులో సభ్యులెవరు?

నూటికి పదముగ్గురు మాత్రమే ఉన్న ఈ వోటర్లను అయినా రాజ్యాంగపరిషత్తుకు సూటిగా తమ ప్రతినిధుల నెన్నుకోడానికి అవకాశం కలిగించలేదు. కనీసం ఆ పదముగ్గురులోనైనా సూటిగా ఎన్నికలు జరిగితే నిజమైన ప్రజాప్రతినిధులు ఏకొద్దిమందయినా గెలుస్తారేమో అనే భయం ధనికవర్గాన్ని పట్టి పీడిస్తోంది. అందువల్ల రాష్ట్రీయ శాసనసభల్లో ఉన్న కొద్దిమంది సభ్యులు మాత్రమే సమావేశమై తమలో తామే రాజ్యాంగపరిషత్తుకు ప్రతినిధుల నెన్నుకున్నారు.

ఇది చాలదా అన్నట్టు ఇంకా రాజులనూ, నవాబులనూ సంతృప్తి పరచడానికై రాజ్యాంగపరిషత్తు మొత్తం సభ్యుల్లో దాదాపు నూటికి 40 మందిని సంస్థానాల తరఫునుంచి తీసుకున్నారు. ఈ నూటికి

40 మంది ప్రతినిధులూ రాజులకూ మహా రాజులకు ప్రాతినిధ్యం వహించేవారే. కాని సంస్థాన ప్రజానీకానికి ప్రాతినిధ్యం వహించేవారు మాత్రం కాదని వేరే చెప్ప నవసరంలేదు.

ఈ విధంగా భారత రాజ్యాంగపరిషత్తు ధనికవర్గ ప్రతినిధులకు ఒక గూడులాగా తయారయింది.

## ప్రజానీకాన్ని ఎలా మోసగించారు?

బ్రిటిష్ మంత్రివర్గరాయబార సభ్యులూ నెహ్రూవగైరా కాంగ్రెసు నాయకులూ కలిసి వయోజన వోటింగు ప్రకారం రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలు జరపడం చాలా ఆలస్యం అవుతుందనే సాకుతో భారత ప్రజానీకాన్ని మోసగించడానికి గూడుపుఠాణీ చేశారు. రాజ్యాంగ పరిషత్తు ఎన్నికలు జరిగి ఇప్పటికి దాదాపు మూడు సంవత్సరాలకాలం (1946జూలై) గడచిపోయింది. కాని ఈ మూడు సంవత్సరాల్లో రాజ్యాంగ పరిషత్తు సమావేశం జరిగింది మొత్తం మూడు నెలలు (90 రోజులు) మాత్రమే. రాజ్యాంగ రచనా కార్యక్రమానికి ఇంతదీర్ఘ కాలాన్ని వినియోగించేటప్పుడు వయోజన వోటింగ్ పై పరిషత్తు ఎన్నికలు జరపడానికి ఈ మూడు సంపత్సరాల్లో ఒక సంవత్సరాన్ని పూర్తిగా వినియోగిస్తే మాత్రం వచ్చే ప్రమాదమేమిటో? రాజ్యాంగ పరిషత్తును ప్రజాస్వామిక విధానంపై నిర్మించక పోవడానికి కారణం సమయాభావంకాదనీ రాజ్యాంగ నిర్మాణంలో ప్రజానీకానికి అధికారం లేకుండా చేయడమే వాళ్ళ అసలు ఉద్దేశం అనీ స్పష్టంగా తెలుస్తూ ఉంది.

# 2. ప్రస్తుత రాజ్యాంగచట్టం : దాని ఆశయం

ప్రస్తుతం తయారుచేస్తోన్న రాజ్యాంగ చట్టంలో రాజకీయపాలసీ నిర్ణయానికి సంబంధించిన 29 వ సెక్షన్‌లో ఇలా ఉంది :

"ఈసెక్షన్‌కు సంబంధించిన నియమాలను ఏ కోర్టుద్వారా గానీ అమలుజరపడానికి వీలు లేదు."

అంటే అర్ధమేమిటి? ప్రభుత్వం తాను తయారుచేసిన చట్టాన్ని అమలు జరపడానికి తనకేమీ బాధ్యతలేదని ప్రకటిస్తోంది. పోనీ, ఏ కోర్టుద్వారానో ఆ నియమాలను అమలు జరిపించడానికి ప్రజలకైనా అధికారం ఉందా అంటే అదికూడాలేదని పైనుదహరించిన సెక్షన్ స్పష్టపరుస్తోంది. ఇంతకూ అసలు ఆ నియమాలేమిటి? తాను తయారుచేసిన నియమాలను తానే అమలు జరుపడానికి ప్రభుత్వం ఎందుకు నిరాకరిస్తోంది? రాజ్యాంగచట్టంయొక్క 30–38 సెక్షన్లలో ఆ నియమాలేమిటో సవిస్తరంగా ఉల్లేఖించబడ్డాయి.

మానవుడు సజీవంగా బ్రతికేందుకు అవసరమైన తిండీ, జీవితావసరాలకు సరిపోను జీతమూ, పనిచేయడానికీ, నిరుద్యోగకాలంలో

ప్రభుత్వం నుంచి సహాయము పొందడానికీ, వృద్ధాప్యంలో పెన్షన్ తీసుకోడానికీ, ప్రతి పౌరుడూ ప్రాథమికవిద్య నభ్యసించడానికీ, ప్రజల జీవిత ప్రమాణం పెంచడానికీ సంబంధించినవే ఆ నియమాలు.

ఈ నియమాలు, ఈ అధికారాలే ప్రజాసామాన్యానికి నిజమైన స్వాతంత్ర్యాన్ని ప్రసాదిస్తాయి. సోవియట్ యూనియన్ రాజ్యాంగ చట్టంలోనేమి, తూర్పు యూరప్ ప్రజాతంత్ర రాజ్యాల రాజ్యాంగ చట్టాల్లోనేమి, ఈ అధికారాలు ప్రజల ప్రాథమిక హక్కులుగా పరిగణించబడ్డాయి. ఈ హక్కులను గుర్తించవలసిన — అమలు జరపవలసిన — బాధ్యతను ఆదేశాల ప్రభుత్వాలే వహిస్తున్నాయి. కాని భారత రాజ్యాంగ చట్టంమాత్రం ప్రజల ప్రాథమిక హక్కులకే మంగళహారతి పాడింది.

పైనుదహరించిన సెక్షన్లలోనే (29–38) 'ప్రజాసామాన్యానికి నష్టంకలిగించే విధంగా కేంద్రీకరణ ఉత్పత్తి సాధనలను అరికట్టడానికి ప్రభుత్వా ఎలాంటి బాధ్యత తీసుకోదు; అని కూడా నిర్వచింపబడింది. అంటే ప్రజాసామాన్యానికి నష్టకరం అనే సాకుతో భారీపరిశ్రమలను జాతీయము చేయడానికి ప్రభుత్వం సమ్మతించదు. ఈ విధంగా భారత రాజ్యాంగ చట్టంలో పెట్టుబడిదారులకు స్వేచ్ఛావిహారం కల్పించబడింది. కొద్దిమంది గుత్త పెట్టుబడిదారుల చేతుల్లో కేంద్రీకరించబడే ఉత్పత్తి సాధనాలను జాతీయం చేయడం జరిగిందని భారత రాజ్యాంగచట్టం సిగ్గువిడిచి బాహాటంగా ప్రకటిస్తోంది.

## కాంగ్రెసు వాగ్దానాలు: ఆచరణ

కాంగ్రెసుపార్టీ మొదటినుంచీ ప్రజలకు అనేక వాగ్దానాలు చేస్తూవచ్చింది. అనేక ఆశలు చూపెట్టింది. ఈ వాగ్దానాల ఫలితంగానే 1946 ఎన్నికల్లో కాంగ్రెసు గెల్చింది. కాంగ్రెసు తన ఎన్నికల మానిఫెస్టోలో ఇలా ప్రకటించింది.

"దరిద్రనారాయణులుగాఉన్న కోట్లకొలది ప్రజాసామాన్యాన్ని బాగుచేయడం, వారి జీవిత ప్రమాణాన్ని పెంచడం ఇదే నేడు మనముందున్న అత్యంత ప్రధానసమస్య."

ఈ సమస్యను పరిష్కరించాలంటే "ప్రజాసామాన్యానికి లాభం కలిగేటట్లు చూడడం, ప్రజలఆర్థిక సాంస్కృతిక, ఆధ్యాత్మికస్థాయిని పెంపొందించడం, నిరుద్యోగ సమస్యను నిర్మూలించడం, వ్యక్తి గౌరవాన్ని వృద్ధిచేయడం" జరగవలసి ఉంటుందనీ, అంగా తాము జరుపుతాం అనీ కాంగ్రెసు మాటఇచ్చింది. వీటితోపాటు "ప్రజల సర్వతోముఖాభివృద్ధికై ఒకప్లానుప్రకారం కృషిచేయవలసి ఉంటుందనీ, కొద్దిమంది వ్యక్తులచేతుల్లో ఆర్థిక కేంద్రీకరణ, అధికార కేంద్రీకరణ

జరగకుండా అరికట్టవలసి ఉంటుందనీ, అందుకోసమే తాము కృషి చేస్తాం"అనీ వాగ్దానాలు చేసింది. "గనులనూ రవాణా సాధనాలనూ, వ్యవసాయాన్నీ, పరిశ్రమలనూ, ఉత్పత్తి పంపకాలనూ సంఘపరం చేస్తాం" అనికూడా కాంగ్రెసు నాయకులు వాగ్దానాలు చేశారు.

(కాంగ్రెసు ఎన్నికల మానిఫెస్టో 1945-46 5వ పేజీ చూడండి!)

కాని నేడు ఆ నినాదాలన్నీ దహానాలయ్యాయి. ఎన్నికల మానిఫెస్టో ఎప్పుడో బుట్ట దాఖలయింది. ఆనాడు పెద్దపెద్ద వాగ్దానాలు చేసిన ఆ కాంగ్రెసు నాయకులే నేడు ప్రజల జీవనస్థాయిని పెంచడానికిగానీ, పనిచూపెట్టడానికి కానీ, భారీ పరిశ్రమలనూ పెద్ద పెద్ద భూఖండాలనూ జాతీయం చేయడానికిగానీ, సంఘద్రోహుల నెదిరించడానికిగానీ తామెంతమాత్రం బాధ్యత వహించం అని నిస్సంకోచంగా ఉద్ఘాటిస్తున్నారు. కోట్లకొలది ప్రజాసామాన్యాన్ని కేవలం మోసగించడానికే కాంగ్రెసు నాయకులు ఈ వాగ్దానాలు చేశారని తేట తెల్లమవుతోంది.

ఈవిధంగా ప్రజలను వంచించి వారి ప్రాథమిక స్వత్వాలను హరించి పైజెప్పిన నియమాల 'ఆధారం' పైనే తమ ప్రభుత్వ పాలసీ నడుస్తుందని చెప్పుతున్నారు. ప్రభుత్వపాలసీ ఏమిటో గత సంవత్సరం నర నుంచీ ప్రజలు తమకండ్లారా చూస్తూనే ఉన్నారు. పరిశ్రమలను జాతిపరం చేయడం అనే సిద్ధాంతానికి ఎప్పుడో స్వస్తి చెప్పబడింది. యుద్ధకాలానికి పూర్వం ఉన్న జీవిత ప్రమాణానికి కూడా నేడు ప్రజలు నోచుకోలేదు. ప్రజల ఆరోగ్యానికీ ఆహారానికీ; విద్యా విజ్ఞానాలకూ తిలాంజలి సమర్పించి మిలటరీ ఖర్చులకోసం, సైనిక ఖర్చులకోసం విపరీతంగా ధనవ్యయం చేయబడుతోంది. పన్నులభారం భాగ్యవంతులపై స్వల్పంగానూ పేదవారిపై అధికంగానూ మోపబడుతోంది. ప్రభుత్వపాలసీ ఏవైపు నడుస్తూఉందో పైవిషయాలే తెలియజేస్తున్నాయి. కాబట్టి అసంఖ్యాక ప్రజానీకాన్ని పొట్టగొట్టి నిలువుదోపిడి చేసే కొద్దిమంది గుత్త పెట్టుబడిదారుల చేతుల్లో ఆర్థిక కేంద్రీకరణ జరగకుండా అరికట్టడం ఈ రాజ్యాంగ పరిషత్తు ఉద్దేశంకాదని అద్దంలాగా ప్రతివారికీ స్పష్టంగా బోధపడుతుంది,

## స్వదేశీ, విదేశీ పెట్టుబడిదారుల దోపిడికి సర్వస్వాతంత్ర్యం

ఈ రాజ్యాంగ విధానాన్ని తయారు చేయడంలో వాళ్ళ ఉద్దేశమేమిటి ? ఉన్నది ఉన్నట్లుగా అసలు విషయాన్ని బైటికి చెప్పడానికి కాంగ్రెసు నాయకులకు దమ్ములులేవు. కాని ఇప్పుడు తయారవుతూన్న రాజ్యాంగ విధాన పాఠమే తన నిజస్వరూపాన్ని బట్టబయలు చేసుకుంటూవుంది. (1) రాజ్యాంగ చట్టం యొక్క 24వ సెక్షన్ (2)లో ఇలాఉంది. ప్రతిఫలం ఇవ్వకుండా "వ్యాపారానికి పరిశ్రమలకూ సంబంధించిన ఏ స్థిరచరాస్తినీ ప్రజాక్షేమం కోసం అని స్వాధీనపరచుకోడం జరగదు"

అంటే పెట్టుబడిదారుల, జమీందారుల సంస్థానాధీశుల స్వప్రయోజనాలకు భంగం కలగకుండా వారి అధికారాలకు

ఎప్పటిలాగే చట్టరీత్యా రక్షణకల్పిస్తున్నారన్న మాట. ఈ పెట్టుబడిదారుల పరిశ్రమలకు ఆర్థికంగా ఇబ్బంది కలిగినప్పుడు నష్ట పరిహారం అనే పేరుతో వాళ్ళకు తగినంత ప్రతిఫలం ముట్టజెప్పి ఆ పరిశ్రమలకు "జాతీయం"అనే ముసుగు తగిలిస్తారు.

స్వార్థపరులైన పెట్టుబడిదారుల యొక్క దోపిడి హక్కులే 'ప్రజల' హక్కులుగా రాజ్యాంగ పాఠంలో చిత్రించబడ్డాయి.

బ్రిటిష్ పెట్టుబడిదారుల యొక్క, తదితర విదేశీ పెట్టుబడి బడిదారులయొక్క స్వార్థప్రయోజనాలను సురక్షితంగా కాపాడడమే 'ప్రాథమిక హక్కుగా' నిర్వచింపబడింది. అమానుష దోపిడీ విధానము ఫలితంగానే బ్రిటిష్ పెట్టుబడిదారులు భారతీయ ఆర్థిక జీవితాన్ని పూర్తిగా తమ పంజాల్లో పెట్టుకున్నారు. బ్రిటిష్ పెట్టుబడిదారుల ఈ పట్టపగటి దోపిడినే నూతన రాజ్యాంగ విధానం చట్టబద్ధం చేస్తూంది. చట్టరీత్యా ఆ దోపిడికి రక్షణకల్పిస్తూ ఉంది. ఈ విధంగా భారత ప్రజలను దోపిడిచేసి కొల్లగొట్టిన ధనంపై న్యాయశాస్త్రరీత్యా వారికి అధికారాన్ని కట్టిపెడుతోంది. భారత ప్రజానీకాన్ని దోచుకోడానికినూతనంగా రంగంలో ప్రవేశిస్తోన్న బ్రిటిష్, అమెరికా పెట్టుబడిదారులకు తగిన హామీ ఇస్తూ ఉంది. వాళ్ళకు కావలసిన లాభాలను గ్యారంటీ చేస్తోంది.

(2) 92, (3) 93 సెక్షన్‌లలో ఇలా ఉంది:

"భారత ప్రభుత్వం ఇవ్వవలసిన రుణాలను వడ్డీతోసహా ఇచ్చివేస్తుంది. ఈ విషయంలో జోక్యం కలిగించుకోడానికి ఇండియాపార్లమెంటుకుకూడా ఎట్టి అధికారం లేదు."

ఈ రుణాలేమిటి? ఇవి మన ప్రజలను బానిసలుగాచేసి మన నెత్తినెక్కి పెత్తనము కొనసాగించేందుకు బ్రిటిషు ప్రభుత్వము తన హయాంలో చేసిన రుణాలు. మనలను బానిసలుగా చేసినందుకు, మన స్వాతంత్ర్యోద్యమాన్ని రక్తప్రవాహంలో ముంచెత్తినందుకు, మన స్వాతంత్ర్య యోధులను తుపాకిగుండ్లకు గురిజేసినందుకు అయిన ఖర్చులకుగాను 'కృతజ్ఞతాపూర్వకంగా' 'స్వతంత్ర' భారతదేశం ఈ రుణాలను వడ్డీతోసహా తీర్చుకోవడం భారతీయుల పవిత్రకర్తవ్య మట !

ఇక రైల్వే ఆదాయాన్నే తీసుకోండి! బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ లాభాల కోసం, భారత ప్రజలను తన సైనిక శాసనంలో నిర్బంధంగా అణచిపెట్టి ఉంచేందుకు రైల్వేలను సాధనాలుగా ఉపయోగించుకున్నారు. ఈ రైల్వేలద్వారా వాళ్లు అంతులేనిలాభాలు గడించారు. సామ్రాజ్యవాదులు తాము రైల్వేలలో పెట్టినమొత్తం పెట్టుబడికంటె వాటిమీద ఇంకా ఎక్కువగానే డబ్బుగడించారు. అయినప్పటికి స్టేట్ రైల్వేల పెట్టుబడి భారతదేశాదాయంలో 'అప్పు' పద్దులోనే ఇంకా వ్రాయబడింది. ఈ అప్పుక్రింద ప్రతి సంవత్సరము భారతదేశ ఆదాయంనుంచి

25 కోట్ల రూపాయలను వడ్డీరూపంలో చెల్లిస్తున్నారు. ఇదే విధంగా ముందు కూడా ప్రతి సంవత్సరమూ 25 కోట్ల రూపాయలను వడ్డీరూపంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు కట్టపెట్ట వలసిందే అని నూతన రాజ్యాంగవిధానంలో ఒక నిబంధన చేర్చబడింది. ఈ నిబంధనను మార్చడానికి శాసనసభకుకూడా ఎట్టి అధికారం లేకుండా చేశారు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులతో చేతులు కలిపి భారత పెట్టుబడిదారులు "ఇండస్ట్రియల్ ఫైనాన్సు కార్పరేషన్"లాంటి అనేక వ్యాపారసంస్థలను నెలకొల్పారు. ఈ సంస్థల్లో పెట్టుబడిదారులతోపాటు భారతప్రభుత్వంకూడా కొంత పెట్టుబడి పెడుతుంది. ఈ సంస్థల్లో పెట్టుబడిదారులకు తప్పనిసరిగా లాభాలను గ్యారంటీ చేయడం జరిగింది. పెట్టుబడిదారుల యొక్క అసమర్థతవల్లగానీ, వ్యవస్థాపకుల తెలివితక్కువతనంవల్లగానీ, లేక మరే కారణంవల్లగానీ, ఈ సంస్థల్లో పెట్టుబడిదారులకు నిర్ణయించిన 'కనీస' లాభాలు రాని పక్షంలో ప్రభుత్వాదాయంనుంచి తీసి ఆలాభాన్ని భర్తీచేయవలసిఉంటుంది.

పెట్టుబడిదారుల పరిశ్రమలను బలీయం చేయడానికీ, పెట్టుబడిదారులకు గ్యారంటీ చేసిన లాభాలను చెల్లించుకోడానికీ, రాజులకూ మహారాజులకూ ప్రతిఫలం ముట్టజెప్పడానికీ ఇది వరకే అర్థాకలితో అలమటించి పోతున్న భారతప్రజానీకం నుంచి గోళ్లూడగొట్టి ఈ డబ్బు వసూలు చేయడం జరుగుతోంది. పెట్టుబడిదారుల బొర్రలు నింపడానికి అయ్యే ఖర్చునంతా పేదప్రజలే భరించవలసి వస్తుంది. నూతన రాజ్యాంగ విధానంలో స్వదేశీ విదేశీ పెట్టుబడిదారులకూ, జమీందారులకూ, సోమరిపోతులకూ, దోపిడిముఠాలకూ ప్రజలను పూర్తిగా పీల్చిపిప్పిచేయడానికి సంపూర్ణ స్వాతంత్ర్యం ఇవ్వబడింది.

## బ్రిటిష్ కామన్‌వెల్తుతో లంకె

భారతదేశంలోని మొత్తం పరిశ్రమల్లో సగభాగంపై యాజమాన్యమూ, అంతకంటె ఇంకా ఎక్కువ పరిశ్రమలపై అధికారమూ చలాయించే బ్రిటిష్ సామ్రాజ్యవాదుల చేతుల్లో భారతదేశ ఆర్థిక జీవితాన్ని సమర్పించిన తర్వాత ఇక భారతదేశం నామమాత్రంగా కామన్‌వెల్తులో ఉంటుందా ? లేక విడిపోతుందా అనేది ప్రధాన సమస్యకాదు. కాని ఇంతకాలం నుంచీ భారతీయులను బానిసలుగా నిర్బంధించి నానా హింసలకు గురిజేసిన బ్రిటిష్ కామన్‌వెల్తులో బహిరంగంగా చేరడానికి నేడు కాంగ్రెసు ప్రభుత్వం పడుతోన్న తాపత్రయం చూస్తూఉంటే మానాభిమానులు వాళ్ళకు తృణప్రాయాలని తేలిపోతోంది. పాపం దీనితో వారి 'జాతీయత' అనే ముసుగుకూడా పటాపంచలైపోయింది. (బ్రిటిషు రాజకిరీటంక్రింద కామన్‌వెల్తులో చేరడానికి ఇప్పుడు బహిరంగంగానే అంగీకరించారు - అనువాదకుడు) భారతరాజ్యాంగ పరిషత్తు యొక్క ప్రథమ సమావేశంలో భారతదేశం 'సర్వస్వతంత్ర ప్రజాతంత్ర రాజ్యము'గా పేర్కొనబడింది. 'సర్వస్వతంత్ర' అనే శబ్దానికి బదులు 'ప్రజాస్వామిక' అనే శబ్దాన్ని చేర్చాలనీ, తత్ఫలితంగా బ్రిటిషు కామన్‌వెల్తులో భారతదేశంకూడా ప్రవేశించడానికి వీలవుతుందని ఒక సవరణ చేర్చబడింది.

(రాజ్యాంగ చిత్తుపాఠం పీఠిక చూడండి)

## సంస్థాన ప్రజలపై సంస్థానాధీశుల సవారీ

(4) రాజ్యాంగ పాఠం యొక్క నాలుగో భాగంలో రాష్ట్రాల ప్రజలకు నామ మాత్రంగా ఇవ్వబడిన రాష్ట్ర ప్రభుత్వమూ ఎన్నికలూ వగైరా కనీస విషయాలను కూడా సంస్థాన ప్రజానీకం నోచుకోలేదు. (128 వ సెక్షన్ చూడండి!) ఎనిమిది కోట్ల జనాభా కలిగిన సంస్థాన ప్రజలకు ఈ నామమాత్ర సౌకర్యాలను కూడా కలిగించ లేదు. ప్రజల రక్తాన్ని పిండి త్రాగే రాజులూ నవాబులూ ఎప్పటిలాగే ప్రజల నెత్తిపై కెక్కి సవారీ చేస్తూనే ఉంటారు. సంస్థాన ప్రజానీకాన్ని తొక్కిపట్టి ఉంచడానికి రాజులకూ, నవాబులకూ, భారత ప్రభుత్వం సంపూర్ణ సహాయాన్ని అంద జేస్తూ ఉంటుంది.

## ధనికులకు పేదలకు ఒకటే సూత్రం

రాజ్యాంగపాఠం 256 (2) సెక్షన్‌లో ఇలా ఉంది:-

**ప్రభుత్వ పరిశ్రమల పైగానీ మ్యునిసిపాలిటీ లేక జిల్లాబోర్డు లకు సంబంధించిన సంస్థలపై గానీ ఉద్యోగాలపైగానీ సాలీనా 250 రూపాయలకు మించి పన్ను వేయ బడదు.**

అంటే కిళ్లీకొట్టు పెట్టుకొని పొట్ట బోసుకొనే పేదవానిపైనా ఫ్యాక్టరీలు పెట్టి లక్షలకు లక్షలు సంపాదించే మిల్లు యజమానులపైనా విధించేపన్నులో 250 రూపాయలకంటె ఎక్కువ తేడా ఉండదు. ఉన్నవారూ లేనివారూ అనే భేదాన్ని పోగొట్టడానికి 'స్వతంత్ర' భారత ప్రభుత్వం ఎంతచక్కని ఉపాయాన్ని కనిపెట్టిందో చూడండి! పిడుగునకూ బియ్యానికీ ఒకటే మంత్రం!

## బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు ప్రత్యేక సదుపాయాలు

రాజ్యాంగ పాఠం 283 వ సెక్షనులో ఇలా ఉంది:-

**"ఇంతకు పూర్వంనుంచీ పెద్ద పెద్ద ఉద్యోగాల్లో హోదాల్లో ఉన్నవారి ఉద్యోగ నియమాలు (అధికారాలూ, వేతనమూ, ఉద్యోగ పదవులూ వగైరా) వెనకటిలాగే ఇకముందు కూడా ఉంటాయి."**

పెద్దపెద్ద ఉద్యోగస్థులను ఒక వర్గ ముగా తయారుచేసి వారికి పెద్దపెద్దజీతాలు (లంచాలు) ఇచ్చి తనకు భృత్యవర్గంగా అట్టిపెట్టుకోడానికి బ్రిటిష్ ప్రభుత్వము ఈ నియమాలను సృష్టించింది. పెద్దపెద్ద ఉద్యోగులను సిఫారసు చేయడం, చేర్చు కోవడం వగైరా కార్యకలాపాలకు సంబం ధించిన సూత్రాలను నిర్ణయించే పబ్లిక్ సర్వీస్ కమిషన్‌లో ఇంతకుపూర్వం పది సంవత్సరాలనుంచి పనిచేస్తున్న వారు కనీసం నూటికి యాభైమంది అయినా అందులో ఉండాలని నూతన రాజ్యాంగ పాఠంలో ఒక నియమం చేర్చబడింది. (185వ సెక్షన్) అంటే ఈ కమిషన్‌లో ఇంతకు పూర్వం పది సంవత్సరాలనుంచి పని చేస్తున్నవారు బ్రిటిష్ సామ్రాజ్య వాదుల తొత్తులని వేరే చెప్పనవసరము లేదుగదా? ఈ తొత్తుల చేతుల్లోనే నేడు

పెద్దపెద్ద ఉద్యోగాలను నిర్ణయించే అధికారం, ఉద్యోగస్థులను చేర్చుకొనే అధికారం సమర్పించబడింది. ఈ తొత్తులంతా బ్రిటిషు ప్రభుత్వ హయాంలో పెట్టుబడిదారుల, జమీందారుల అడుగులకు మడుగులొగ్గినవారే. పేదలపేరు వినినంత మాత్రానే మండిపడినవారే. అయితే నేం? భారత ప్రజలనూ, ప్రజా ఉద్యమాన్నీ నిర్దాక్షిణ్యంగా నిరంకుశంగా అణగగొట్టడంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల మెప్పులు పొందారు. ఈనాడు కాంగ్రెసు ప్రభుత్వానికి కావలసిందికూడా అదే సర్టిఫికెట్.

## సామ్రాజ్యవాద - బూర్జువా అధినివేశ రాజ్యం

పై నుదహరించిన విషయాలనుబట్టి భారత దేశంలో ఇకముందుకూడా బ్రిటిష్ పెట్టుబడిదారుల, ఇండియా పెట్టుబడిదారుల దోపిడి యథేచ్ఛగా కొనసాగుతుందని స్పష్టంగా బోధపడుతుంది. ఇందుకోసమే రాజ్యాంగ యంత్రాన్ని వాళ్ళు పూర్తిగా ఉపయోగించుకుంటారు. బ్రిటిష్ పెట్టుబడిదారులతో సంబంధాలు యధారీతిగా. అట్టిపెట్టుకోడానికే ఇండియాను బ్రిటిషు కామన్‌వెల్తుతో ముడిపెడతారు. దీనితోపాటు అమెరికా సామ్రాజ్యవాదులను కూడా తమకు తోడుదొంగలుగా ఆహ్వానిస్తారు.

ప్రజా విప్లవాగ్నిలోబడి ఆహుతి అయిపోకుండా రాజులనూ, నవాబులనూ వాళ్ళ సిరిసంపత్తులను సురక్షితంగా కాపాడడంకూడా ఈ రాజ్యాంగపరిషత్తుయొక్క మరో ఉద్దేశ్యం. సామ్రాజ్యవాదులూ, పెట్టుబడిదారులూ, సంస్థానాధీశులూ, కలిసి ప్రజావుద్యమాన్ని అరికట్టి, అణచివేసి భారత ప్రజానీకాన్ని శాశ్వత దారిద్ర్యంలో ముంచివేయ జూస్తున్నారు. భారతదేశాన్ని ఒక సామ్రాజ్యవాద-బూర్జువా అధినివేశ రాజ్యంగా అట్టిపెట్టేందుకు ప్రయత్నిస్తున్నారు.

వీటన్నిటికి అంగీకరించే కాంగ్రెసు నాయకులు బ్రిటిష్ ప్రభుత్వంతో ఒడంబడిక చేసుకున్నారు. ఈ ఒడంబడిక నమలుజరపడానికే అన్నం అడిగే ప్రజలపై తుపాకిగుండ్లు కురిపిస్తున్నారు.

# 3. రాజ్యాంగ స్వరూపము

ప్రజల నెల్లప్పుడూ అశక్తులుగా అట్టిపెట్టేవిధంగా, ప్రజలు తమ ప్రతిఘటనా శక్తిని కోల్పోయేవిధంగా ఈ బూర్జువా అధినివేశ రాజ్యాంగ స్వరూపాన్ని దిద్ది తీర్చారు. ప్రజల నణచేందుకు ప్రభుత్వ యంత్రాన్ని తమ చేతుల్లో ఒక సాధనంగా నిర్మించుకున్నారు.

రాజ్యాంగపరిషత్తు ఎన్నికల తరుణంలో సమయాభావం అనే సాకుతో ప్రజలకు వయోజన నిర్ణయాధికారం లేకుండా చేశారు. కాని ఇప్పుడు కొత్తగా తయారు చేసే రాజ్యాంగ విధానంలో వయోజన వోటింగుకు స్వస్తిచెప్పడం ఏలా? వెనకటి సాకు ఇప్పుడు ఉపయోగించదుగదా? కాబట్టి దీనికి కొత్తఎత్తుగడ అవసరం అయింది. మాటల్లో అంగీకరించి చేతల్లో దాన్ని నిరుపయోగ చేయాలి' ఇదే వారువేసిన 'గొప్ప'ఎత్తుగడ. ప్రజలను మోసగించడానికి పన్ని... వల. 21 సంవత్సరాలుగానీ అంతకుమించిన

వయస్సుకలవారికిగానీ వోటింగు అధికారం ఉంటుందని రాజ్యాంగ పాఠంలో అంగీకరించబడింది. ఈ వయస్సుగలవారు రాష్ట్రశాసనసభలకూ, కేంద్ర శాసన సభకూ (క్రింది సభలకు మాత్రమే) జరిగే (జరిగితేమాట) ఎన్నికల్లో అయిదు సంవత్సరాలకొకసారి పాల్గొనవచ్చు.

పెట్టుబడిదారీవర్గం ఉన్నంతకాలం, కొద్దిమంది స్వార్థపరుల చేతుల్లో ధనము కేంద్రీకరించబడి ఉన్నంతకాలం నిజమైన ప్రజాస్వామికం అంటూ ఉండదు. ఉండజాలదు. అది కేవలం బూర్జువా ప్రజాస్వామికంగానే ఉంటుంది. వయోజన వోటింగుకూడా బూర్జువావర్గ పరిధుల్లోనే ఉంటుంది. బూర్జువా ప్రజాస్వామికంలో 'ముందున్న' ఫ్రాన్సు, బ్రిటన్, అమెరికా లాంటి పెట్టుబడిదారీదేశాల్లో సైతం వయోజనవోటింగు బూర్జువావర్గానికి ఎలా ఉపయోగపడుతుందో ప్రతినిత్యం చూస్తూనే ఉన్నాం. వోటింగు విషయములో పేదప్రజలనేక కష్టాల నెదుర్కోవలసివస్తుంది. ఆ కష్టాలనుగురించి మొర పెట్టుకున్నా వాటిని విచారణ జరిపేది బూర్జువా ప్రభుత్వమే కాబట్టి దాని పర్యవసానం ఎప్పుడూ 'పిల్లికి ఎలుకసాక్ష్యం' లాగే ఉంటుంది. నివేశనస్థలమూ, ప్రమాణపత్రాలూ, ప్రాతినిధ్యవిధానమూ మీటింగులు పెట్టుకోడానికీ, ప్రచారం చేసుకోడానికీ అవకాశాలూ సాధనాలూ (లారీలూ మైక్రోఫోన్లు వగైరా) వార్తాపత్రికలపై పెట్టుబడిదారుల గుత్తాధికారమూ, రేడియో ప్రభుత్వాధికారమూ ఇవన్నీ పేదప్రజ వ్యతిరేకంగా పనిచేస్తాయి. కాబట్టి బూర్జువావర్గం పేదప్రజలకు ఒక చేతితో ఓటు ఇచ్చి మరోచేతితో పుచ్చుకోడం జరుగుతుంది. అందుకనే లెనిన్ మహాశయుడు ఇలా అన్నాడు ;

"పేదప్రజలు అడుగడుగునా ఎదుర్కొనే అబద్ధప్రచారాలూ, నిషేధాలూ, ఆటంకాలూ, బీదతనం బాధఅంటే ఏమిటో తెలియని - బీదప్రజలతో ఏమాత్రం సన్నిహిత సంబంధంలేని - బూర్జువా వర్గం దృష్టిలో చాలా స్వల్ప విషయాలుగానే కనిపిస్తాయి. బూర్జువా ప్రచారకులలో, (బూర్జువా రాజకీయనాయకులలో నూటికి 99 మంది కాకపోయినా నూటికి 90 మంది అయినా తప్పకుండా ఇలాంటి వాళ్ళేఅయి ఉంటారు.) కాని మొత్తం ఈ బాధలన్నీ కలిసి పేదప్రజలనురాజకీయాలనుంచి దూరం చేస్తాయి. ప్రజాస్వామిక విధానంలో వాటిని చురుకుగా పాల్గొననీయకుండా చేస్తాయి".

వయోజన వోటింగులో ఇన్ని ప్రతిబంధకాలూ, ఇన్ని అభ్యంతరాలూ ఉన్నా, బ్రిటిష్ అమెరికా సామ్రాజ్యవాదుల అడుగుజాడల్లో నడుస్తూన్న భారత పెట్టుదారీ వర్గానికి ఇంకా తాము సురక్షితంగా ఉన్నాం అనే ధైర్యం కలగలేదు. అందుకనే కొత్తగా ఇంకా అనేక 'రక్షణ శ్రేణు'లను నిర్మిస్తు

కున్నారు. కొత్తగా మరికొన్ని ప్రజాస్వామిక వ్యతిరేక పద్ధతులను కనిపెట్టారు. ఉదాహరణకు ఈ క్రింది విషయాలను పరిశీలించండి:-

(1) నూతన రాజ్యాంగపాఠం ప్రకారం బ్రిటిష్ ఇండియా అనబడే ప్రదేశాల్లో నివసించే వారికి మాత్రమే వయోజన వోటింగు అధికారం ఉంటుంది. ఈ సూత్రప్రకారం స్వదేశ సంస్థానాల్లో నివసించే 8 కోట్ల ప్రజలకు వోటింగులో పాల్గొనే అధికారం లేకుండా ఎగిరి పోయింది. (67, 149 సెక్షనులు) సంస్థాన ప్రజల హక్కులు రాజులూ, మహారాజుల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి ఉంటాయి. రాజుల చిత్తం ప్రజల ప్రాప్తం, అంతే!

**(2) వోటింగులో పాల్గొనేవారికి కనీసం 21 సంవత్సరాల వయస్సు అయినా ఉండాలి.**

ఈ సూత్రప్రకారం నవయువకుల్లో అనేకమంది వోటింగులో పాల్గొనడానికి వీల్లేదు. కాంగ్రెసులో సభ్యులుగా చేరడానికి 18 సంవత్సరాల వయస్సుఉంటే చాలు, కాని వోటువేయడానికి మాత్రం 18 సంవత్సరాలు చాలవట! 21 సంవత్సరాల వయస్సు ఉండాలట!

21 సంవత్సరాలలోపు నవయువకులకు జైళ్ళకువెళ్ళడానికైతే అధికారం ఉంది. లాఠీదెబ్బలు తినడానికి అధికారంఉంది. నాయకులు చేసే దోపిడిలో సహాయం చేయడానికి అధికారంఉంది. కాని వారికి వోటుచేసే అధికారం మాత్రం లేదట? ఏం? ఎందువల్ల? నవయువకుల్లో ఎక్కువమంది అభివృద్ధి కాముకులుగా ఉంటారనేగా వీళ్ళభయం? నవయువకులందరికి వోట్లిస్తే వీరి అభివృద్ధి నిరోధక ఆటలు స్వేచ్ఛగా సాగవని వాళ్ళకు తెలుసు. సోవియట్ రష్యా, జకోస్లోవేకియా లాంటి నిజమైన ప్రజాతంత్ర రాజ్యాలన్నింటిలో 18 సంవత్సరాల వయస్సు గల వారందరికి వోటింగులో పాల్గొనే అధికారం ఉందనే విషయం ఈ సందర్భంలో మనం గుర్తుంచుకోవలసి ఉంటుంది.

(3) కేంద్ర శాసనసభలో (క్రిందిసభ, లోవర్‌హౌస్) 500 కంటె ఎక్కువ సభ్యులుండగూడదని నూతన రాజ్యాంగ విధానంలో మరోనిబంధన చేర్చబడింది. అనగా సగటున ఆరులక్షలమంది ప్రజలకు కలసి ఒక నియోజకవర్గం అన్నమాట. (67 వ సెక్షన్) ఇంతపెద్ద విశాలక్షేత్రంలో ఆరు లక్షలమంది ప్రజల్లో - జరిగే ఎన్నికల పోరాటానికి అయ్యే ఖర్చును భరించడం సామాన్య ప్రజానీకానికి దాదాపు సాధ్యంగానిపని. దోపిడి వగైరా విషయాలన్నింటిలో బ్రిటిష్ సామ్రాజ్యవాదుల అడుగుజాడల్లో నడుస్తోన్న భారత పెట్టుబడిదారీ వర్గానికీ, ఆ వర్గంయొక్క రాజకీ నాయకులకూ ఈ విషయంలోమాత్ర బ్రిటిష్ ఆదర్శంపనికిరాలేదుకాబో బ్రిటన్‌లో ఎంతపెద్ద నియోజక వర్గ కూడా 70 వేలకు మించిన ప్రజలుండ కాని మరి మనదేశంలోనో సగటున 6 లక్

మంది ప్రజలట! పెట్టుబడిదారీవర్గ ప్రయోజనాలను కాపాడడానికి ఎంత పకడ్‌బందీగా 'మేకుబిగింపు' చేశారో చూడండి! ఇక రాష్ట్ర శాసనసభల నియోజక వర్గాల్లోకూడా ఒక్కొకచోట 2 లక్షల మందిదాకా ప్రజలుంటారు. (149 వ సెక్షన్.)

## పైసభ: స్వార్థపరుల గూడుపుఠాణి

(4) ప్రభుత్వయంత్రంపై పెట్టుబడిదారీ వర్గాధికారాన్ని ఇంకా పదిలంగా-పకడ్‌బందీగా - ఉంచేందుకు 225 మంది సభ్యులతో ఒక కౌన్సిలును (అప్పర్ హౌస్) తయారుచేశారు. (67 వ సెక్షన్) ఈ 225 మందిని ఎన్నుకునే అధికారం ప్రజలకేమాత్రం లేదు.

ఈ 225 మంది సభ్యుల్లో 12 మందిని అధ్యక్షుడే స్వయంగా నామినేట్ చేస్తాడు. ఐతే ఈనామినేషన్ "కళావిజ్ఞానాలనూ, సంఘసేవనూ, అనుభవాన్నీ" దృష్టిలో వుంచుకొని చేయడం జరుగుతుందట! అంటే ఈ 12 గురూ పెట్టుబడిదారీవర్గాన్ని ఆశ్రయించి బ్రతికే చదువుకున్న 'వందిమాగధులు' అని వేరే చెప్పనవసరంలేదు.

చీఫ్ కమీషనర్ అధీనంలో ఉండే ప్రాంతంనుంచి వచ్చే ఇద్దరు సభ్యులను కూడా నామినేటే సభ్యులక్రిందనే జమ కట్టుకోవచ్చు.

పోతే ఇక 75 మంది సభ్యులు సంస్థాన ప్రతినిధులు. సంస్థానాల్లోవున్న శాసనసభలు వట్టి బూటకసభలని అందరికి తెలిసిన విషయమే. ఈ 75 మంది సంస్థానాధీశుల చెప్పుచేతల్లో నడిచే 'హారాఖుహార్' గాళ్ళే.

ఇక మిగతావున్న 141 మంది సభ్యులను రాష్ట్ర శాసనసభలు (క్రింది సభలు) ఎన్నుకుంటాయి. అంటే వీరుకూడా ప్రజలద్వారా ప్రత్యక్షంగా ఎన్నుకోబడకుండా దొడ్డిదోవన వస్తారు. ఎన్నికలలో వోట్లకోసం నూటికా ప్రజల సమక్షానికి వెళ్ళితే తాము చేసే పిచ్చి పనులకు కొన్నిటికైనా సమాధానాలు చెప్పుకోవలసి వస్తుంది. కాబట్టి అలాంటి సభ్యులకు నూతన రాజ్యాంగవిధానం ఈ ఇబ్బందులేమీ లేకుండా చేసింది. మైనారిటీ పార్టీ నుంచి దామాషాప్రకారం సభ్యులనెన్నుకోకుండా ముందే తగిన కట్టుదిట్టాలు చేయబడ్డాయి. మెజారిటీపార్టీ తన సంఖ్యాబలంతో ఇష్టంవచ్చినట్లు స్వార్థపరులనూ, అధికలాభ పరులనూ గొంగమార్కెట్ దార్లనూ, పెట్టుబడిదార్లనూ, వాళ్ళతొత్తులనూ తేలికగా ఎన్నుకోగలుగుతుంది. ప్రాతినిధ్యం ఎక్కువగాఉన్న క్రిందిశాసనసభ నెత్తిపై పూర్తిగా ధనికవర్గ ప్రతినిధుల గూడు అయిన కౌన్సిలును (పై శాసనసభ) రుద్దారు. ఆర్థిక విషయానికి సంబంధించిన బిల్లులు మినహా మరే బిల్లుకూడా రెండు శాసన సభలు అంగీకరించనిదే, (87 సెక్షన్) లేక రెండు సభల సమిష్టి సమావేశంలో మెజారిటీ సభ్యులు అంగీకరించనిదే (సెక్షన్ 88) చట్టంగాదు అని రాజ్యాంగ పాఠంలో స్పష్టంగా ఉల్లేఖించబడింది. ఆర్థిక విషయానికి సంబంధించిన బిల్లులనుకూడా ప్యాసు కానివ్వకుండా కౌన్సిలు ఎంతో కాలవిలంబన జరిగేటట్లు చేయగలదు. అయితే చివరకు నిర్ణయాధికారం మాత్రం క్రింది శాసనసభదే అయి ఉంటుంది. (సెక్షన్ 89)ఒకవేళ తప్పిదారి ఎప్పుడైనా నూటికి కోటికి ఒక ప్రజాతంత్రనిర్ణయాన్ని

చేయడానికే క్రిందిశాసనసభ ప్రయత్నించినట్లైతే దాన్ని విఫలంచేయడానికి లేక దాన్ని విలంబనచేయడానికే పైశాసనసభ సృష్టించబడింది. ధనికవర్గ ప్రయోజనాలను సురక్షితంగా కాపాడేందుకు పై శాసనసభ కాపలాదారుగా పనిచేస్తూ ఉంటుంది.

(5) ఇదే విధంగా పశ్చిమ బెంగాల్, బొంబాయి, మద్రాసు, యు.పి. తూర్పు పంజాబు, బీహారులాంటి రాష్ట్రాల్లోకూడా అసెంబ్లీ నెత్తిపై కౌన్సిలును ఎక్కించడం జరిగింది. రాష్ట్ర అసెంబ్లీలలో లక్ష జనాభాకు ఒక సభ్యుడు చొప్పున ఉంటాడు. కాని అసెంబ్లీ సభ్యులమొత్తం సంఖ్య 300 కంటె మించి ఉండగూడదనే మరో నియామకంకూడా ఉంది.

రాష్ట్రాలలో కౌన్సిల్ సభ్యత్వం అసెంబ్లీ సభ్యుల సంఖ్యలో నాలుగోవంతు ఉంటుంది. ఉదాహరణకు పశ్చిమ బెంగాల్లో అసెంబ్లీ సభ్యత్వం 220 ఉంటే కౌన్సిల్ సభ్యత్వం 55 ఉంటుంది. యీ 55 మంది సభ్యుల్లో మూడోవంతును అనగా 18 మందిని అసెంబ్లీ ప్రతినిధులెన్నుకుంటారు. మొత్తం 55 మందిలో సగం మంది అనగా 27 గురు నామినేట్ చేయబడిన సభ్యులుంటారు. వీరిని నామినేట్ చేసేదెవరో ఇంకా నిర్ణయించబడలేదు. బహుశా ఆయా రాష్ట్రాల గవర్నర్లకే నామినేట్ చేసే అధికారం ఇవ్వబడుతుంది. పోతే మిగతా పదిమందిని కూడా గవర్నరే నామినేట్ చేస్తాడు. (సెక్షన్ 150) మొత్తంమీద పైసభల్లో-కౌన్సిళ్లల్లో - ఉండే ప్రతినిధులంతా ధనికవర్గానికి కాపలాకుక్కల్లాంటి వాళ్లని చెప్పవచ్చు. అసెంబ్లీలాగా కౌన్సిలుకు 5 సంవత్సరాలకొకసారి ఎన్నిక జరగదు. ఒక మూడోవంతు సభ్యులు మూడు సంవత్సరాలవరకు, మరో మూడోవంతు సభ్యులు 6 సంవత్సరాలవరకు, మిగతా మూడోవంతు కొత్త, పాత సభ్యులు 9 సంవత్సరాల వరకు సభ్యులుగా ఉంటారు. (159 వ సెక్షన్ చూడండి.)

## ఎన్నికసిద్ధాంతానికి స్వస్తి

భారత రాజ్యాంగంలో "శాసన సభలన్నీ వయోజన వోటింగ్ సూత్రం పై ఎన్నుకోబడతాయి" అని 1945-46 ఎన్నికల ప్రణాళికలో కాంగ్రెసు ప్రజలకు వాగ్దానం చేసింది. కాని ఆ వాగ్దానాన్ని నేడు బుట్టదాఖలు చేసి క్రిందినుంచి పైదాకా బాహాటంగా సిగ్గువిడిచి ప్రజాస్వామిక వ్యతిరేక పద్ధతుల నవలంబిస్తోంది. ఢిల్లీ, అజ్మీర్ - మార్వాడ్, కుర్గ్ లాంటి చీఫ్ కమిషనర్ స్వాధీనంలోఉన్న రాష్ట్రాల్లో అసలు ఎన్నికల విధానము అంటూ లేనేలేదు. ఇండియా ప్రెసిడెంటు ఒక్కడే ఆ ప్రజలకు భాగ్యవిధాతగా - డిక్టేటరుగా - ఉంటాడు.

## స్వదేశ సంస్థానాలు

ఇక సంస్థానప్రజల అదృష్టమంతా రక్తపిపాసులైన రాజుల మహారాజుల నవాబుల చేతుల్లో ఉంటుంది. కాంగ్రెసుప్రభుత్వ పుణ్యమా అంటూ ఈ రాజులు నేడు రాజప్రముఖులు ఉపరాజప్రముఖులుగా తయారయ్యారు. రాష్ట్రాల్లో ప్రజలకు కొంతగాకపోతే కొంతైనా ఎన్నికల్లోపాల్గొనే అధికారమంటూ ఒకటి ఉంది' కాని నూతన రాజ్యాంగవిధానం స్వదేశ సంస్థానాలకు మాత్రం అన్వయించదట! (సెక్షన్ 128)

పెట్టుబడిదారీవర్గ ప్రతినిధులై, కాంగ్రెసునాయకులు తమ పక్షాన్ని బలపరచుకోవడంకోసం రాజులతోనూ, నవా

బులతోనూ సంధి - ఒడంబడికలు చేసుకుంటున్నారు. ఈ రాజులూ నవాబులూ ప్రజల కోపాగ్నికి గురియై మిడతల్లాగా మాడిపోకుండా ఉండేందుకు వీళ్ళను కాంగ్రెసు ప్రభుత్వం రాజప్రముఖులుగా ఉపరాజ ప్రముఖులుగా మార్చింది. స్వదేశ సంస్థానాల విషయాలలో జోక్యం కలిగించుకోడానికి 'స్వతంత్ర' భారత రాజ్యాంగ విధానానికెట్టి అధికారం లేకుండా చేసింది.

## అధ్యక్షుని ఎన్నిక

ఇండియన్ యూనియన్ ప్రెసిడెంటుఒక హిట్లరు. అతనిని ఎన్నుకోడానికి ప్రజలకధికారం లేదు. రాష్ట్రకేంద్రకౌన్సిల్ అసెంబ్లీలసభ్యులు మాత్రమే ఇండియా ప్రెసిడెంటుని ఎన్నుకుంటారు. ఎన్నికల విధానంలో ధనికవర్గ ప్రతినిధులే గెలిచేటట్లు రాజ్యాంగ చట్టములో అనేక కట్టుదిట్టాలు చేయబడ్డాయి. కాని ఈ కట్టుదిట్టాలన్నీ ప్రెసిడెంటు ఎన్నికకు చాలవనుకున్నారు. ఇంకా గట్టిగా పకడ్బందీ చేశారు. తదితర విషయాల్లో సామాన్యంగా అమెరికా సామ్రాజ్యవాదుల అడుగుజాడలలో నడిచే కాంగ్రెసునాయకులు ఈ విషయంలో మాత్రం అమెరికానుకూడా తలదన్నిపోయారు. అమెరికాలో అధ్యక్షుని ఎన్నుకోడానికి ప్రజలకు కొంతవరకైనా అవకాశం కల్పించబడింది. కాబట్టే గుత్త వ్యాపారస్తుల ముఠా వ్యతిరేకించినా రూజ్‌వెల్టు మూడోసారి మళ్లీ ప్రెసిడెంటుగా ఎన్నుకోబడ్డాడు. కాని ఇండియాలో మాత్రం పొరపాటునకూడా అలాంటిది జరగకుండా పెట్టుబడిదారులు ముందే జాగ్రత్తపడ్డారు.

రాష్ట్రాల్లో గవర్నర్ల ఎన్నిక ప్రజల వోటు ద్వారానే జరుగుతుంది. కాని ఈవిషయం కాంగ్రెసునాయకుల కంతగా రుచించలేదు. వారి దృష్టిలో ఇది కంటకప్రాయంగాఉంది. అందువల్ల దానికొక సవరణ చేర్చారు. రాష్ట్ర శాసనసభలు రెండూ (అసెంబ్లీ, కౌన్సిలు)కలిసి గవర్నర్ పదవికి నాలుగుపేర్లను సూచిస్తాయి. ఆ నాలుగు పేర్లలోనుంచి తనకు నచ్చిన వారినొకరిని భారత యూనియన్ ప్రెసిడెంటు నామినేట్ చేస్తాడు. ఈసవరణను రాజ్యాంగ పరిషత్తు అంగీకరించే సూచనలే ఎక్కువగా కనిపిస్తున్నాయి.

ఈ విధంగా అనేక వడపోతలతో వయోజన వోటింగ్ అనే సూత్రాన్ని కాంగ్రెసు నీళ్ళు కార్చివేసింది, నూతన రాజ్యాంగ విధానంలో నిజమైన ప్రజాభిప్రాయం ప్రతిబింబించకుండా అనేక గండకత్తెరలను — ప్రతిబంధకాలను— అడుగడుగునా నెలకొల్పింది.

# 4. రాష్ట్రాలూ - కేంద్రం

నూతన రాజ్యాంగవిధానం ఒక నూతన సాంఘికవిధానంగా ఉంటుందనీ, అందులో వేరే ప్రదేశాలకూ, ప్రాంతాలకూ స్వపరిపాలనాధికారం ఉంటుందనీ కాంగ్రెసు వాగ్దానం చేసింది. (1945-46 ఎన్నికల ప్రణాళిక.)

రాజ్యాంగ పాఠంలో నిర్వచింపబడకుండా మిగిలిన శేషాధికారాలన్నీ రాష్ట్ర

లకే ఉంటాయనీ భాషాప్రయుక్తంగా రాష్ట్రాలు కొత్తగా నిర్మించబడతాయని కూడా వారు వాగ్దానాలు చేశారు.

## దోపిడీకి వీలుగా రాష్ట్రాలు

పెత్తనం చేతికి వచ్చినవెంటనే తదితర వాగ్దానాల్లాగే దీనికికూడా స్వస్తిచెప్పడం జరిగింది. రాష్ట్రాలకు స్వపరిపాలనాధికారం లేకపోగా తమ దోపిడికి వీలుగా ఉండేటట్లు కేంద్రాన్ని ఇంకా ఇతోధికముగా బలపరచేందుకు కొత్తకొత్త పద్ధతులు కనిపెట్టబడుతున్నాయి.

పన్నులు వసూలు చేయడం, శాంతి భద్రతలు కాపాడడం (అంటే ప్రజలను అణగగొట్టడం) ఈ రెండూ రాష్ట్ర ప్రభుత్వాలు నిర్వహించవలసిన ప్రధాన కర్తవ్యాలు. భూములు, అడవులు వగైరా కొన్ని విషయాలను మినహాయిస్తే ఇతర దేశాల్లో మ్యునిసిపాలిటీల కెలాంటి అధికారాలుంటాయో అలాంటి అధికారాలే ఇండియాలో రాష్ట్రాల కివ్వబడ్డాయి.

(7 వ షెడ్యూల్లో స్టేట్సు సూచిక)

## కేంద్రం - ఒక దోపిడి కేంద్రం

విదేశ వ్యాపారమూ, ఓడ రేవులూ, రవాణా సాధనాలు, ప్రచారసాధనాలు రక్షణశాఖ, ఆ శాఖకు సంబంధించిన పరిశ్రమలూ, ఆదాయపుపన్ను, పొగాకుపై పన్ను, కరెన్సీ, రిజర్వుబ్యాంకి - ఇవన్నీ కేంద్రాధికారానికి లోబడి ఉంటాయి. బ్యాంకులూ, ఇన్సూరెన్సు కంపెనీలూ, స్టాక్ ఎక్స్ఛేంజీ, పెట్రోలు, గనులూ, విమానమార్గాలపై కేంద్రానికి సంపూర్ణాధికారం ఉంటుంది. వ్యాపార సంస్థలన్నింటినీ చేర్చడానికీ, నడపడానికీ, అంతం చేయడానికీ కేంద్రప్రభుత్వానికే అధికారం ఉంటుంది. అంటే పరిశ్రమలనూ లాభాలను కూర్చిపెట్టే తదితరసాధనాలన్నింటిని కేంద్రప్రభుత్వం తనఅధీనం క్రిందనే - తన గుప్పెట్లోనే - ఉంచుకొని బిర్లా టాటా దాల్మియాలాంటికోటీశ్వరులకనుసన్నల్లో నడుపుతుంది.

జనపనార (జూట్) ఎగుమతులపై వేసే పన్నుల్లో అధికభాగం దానినుత్పత్తి చేసే కష్టజీవులకే చెందాలని కాంగ్రెసు ఇదివరకు అనేకసార్లు డిమాండ్ చేసింది. కాని ఇప్పుడు పెత్తనం కాంగ్రెసు నాయకుల చేతుల్లోకి రాగానే "జనపనారను గురించి ఇండియా పార్లమెంటు అన్యథా నిర్ణయించనంతకాలం జనపనార ఎగుమతులపై పన్నులు వగైరా విషయాలన్నీ వెనకటిలాగే అమల్లో ఉంటాయి" అని నూతన రాజ్యాంగవిధానంలో కాంగ్రెసు తన మొండిచెయ్యి కాస్తా బైటబెట్టింది.

(సెక్షన్ 254)

## రాష్ట్రీయ స్వపరిపాలనకు తిలాంజలి

నూతన రాజ్యాంగ విధానంలో బూర్జువావర్గ ప్రయోజనాలను రక్షించడానికి ఇన్ని కట్టుదిట్టాలు చేసినా పాపం వారికింకా సంతృప్తికలగలేదు. అందువల్ల రాజ్యాంగపాఠం చివర పూర్తిగా మరో నూతనాధ్యాయాన్నే చేర్చారు. (17 వ భాగం, 306 సెక్షన్) ఈ అధ్యాయం లోని నిబంధనల ప్రకారం కేంద్రానికి ఇతోధిక విస్తృతాధికారాలు లభించాయి. నూతన రాజ్యాంగపాఠం చట్టం అయిన తర్వాత 5సంవత్సరాలవరకు రాష్ట్రాలలోని బొగ్గు, ఇనుము, అభ్రకము, నూలు బట్టలు, ఉన్నిబట్టలు, కాగితం, ఆహార పదార్థాలు (నూనెలుకూడా ఈ పద్దులోనే జమ) పెట్రోలు, పెట్రోలుతో

తయారయ్యే వస్తువులూ, యంత్రాలద్వారా నడిచే బండ్లపరికరాలను తయారుచేసే కార్ఖానాలు, వ్యాపారానికి సంబంధించిన సప్లయిలు పంపకం, క్రయవిక్రయాలపై కేంద్రానికే సర్వాధికారాలుంటాయి. దీన్నే ఇంకా స్పష్టంగా చెప్పాలంటే రాష్ట్రాలలోని వివిధ వస్తువులన్నింటిపై తాతా బిర్లా దాల్మియాలకు సంపూర్ణాధికారం ఉంటుంది.

ఈ కథాక్రమం అంతా జరిగిన పిమ్మట కేంద్ర, రాష్ట్రప్రభుత్వాల జాబితాల్లో చేర్చకుండా మిగిలిపోయిన 'విశేష' అధికారాలన్నీ కేంద్రప్రభుత్వం చేతుల్లోనే ఉంటాయి. విశిష్టాధికారాలన్నీ రాష్ట్రాలకే ఉంటాయని కాంగ్రెసు మొదట వాగ్దానము చేసింది. గాలిలో ఎగిరిపోయిన అన్ని వాగ్దానాల్లో ఇదొకటి.

“రాష్ట్రాలకు సాధ్యమైనంత ఎక్కువ స్వాతంత్ర్యం ఇచ్చేందుకు కేంద్రప్రభుత్వ జాబితాలో ముఖ్యమైన విషయాలు సాధ్యమైనంత తక్కువగా ఉదహరించబడతాయి” అని కాంగ్రెసు వాగ్దానాలపై వాగ్దానాలు చేసింది. కాని తీరా సమయం వచ్చేటప్పటికి పుండుమీద కారం రాసినట్లు కేంద్రకౌన్సిల్ (ధనికవర్గ ప్రతినిధుల పుట్ట)లో మూడింట రెండువంతుల మెజారిటీతో రాష్ట్రాలకు చెందిన ఏ అధికారాన్ని అయినా కేంద్రప్రభుత్వం లాక్కోవచ్చనీ, దాన్నిగురించి కొత్తగా చట్టం చేయవచ్చుననీ నూతన రాజ్యాంగపాఠం చివర అధ్యాయంలో చేర్చబడింది.

## భాష

భాషా సంస్కృతుల ఆధారంపై రాష్ట్రాలను పునర్నిర్మిస్తాం అన్న వాగ్దానానికేగతి బట్టిందో మనందరికి సుపరిచితమే. రాజ్యాంగ పరిషదధ్యక్షుడు వేసిన కమిషన్ (ధార్ కమిటీ) భాషాప్రయుక్త రాష్ట్రాలను పూర్తిగా తెగనాడింది.

భాషలన్నింటినీ సమానంగా గౌరవించడం నిజమైన ప్రజాతంత్ర లక్షణం. కాని ఈ నూతన రాజ్యాంగ పరిషత్తు దీనికి కూడా ఒక సలాంగొట్టింది. రాజ్యాంగ పరిషత్తు కార్యక్రమం అంతా ఇంగ్లీషులో గానీ లేక హిందీలోగానీ జరగాలని నిర్ణయించింది. హిందీని రాజభాషగా జేసి ప్రజలందరిపైనా బలాత్కారంగా రుద్దాలని కాంగ్రెసునాయకులు మహాసంబరపడుతున్నారు. భాషలన్నిటిని సమానదృష్టితో చూడకపోవడం, **ఒకభాషను రాజభాషగా తదితర భాషల నెత్తిపైకెక్కించడం ప్రజాసామాన్యాన్ని రాజకీయ కార్యక్రమంలో ప్రధానపాత్ర వహించకుండా వారిపురోభివృద్ధిమార్గంలో ప్రతిబంధకాలను కల్పించడమే అవుతుంది.** హిందీ నొక్కదానినే రాజభాష చేసిన ఫలితంగా హిందీమాతృభాషగాలేని కోటానుకోట్ల ప్రజలు ప్రధాన రాజకీయ రంగంలోనూ ప్రధాన కమిటీల్లోనూ పాల్గొనే అవకాశాన్ని కోల్పోతారు. ఈ విధంగా హిందీరాని కోటానుకోట్ల ప్రజలను రాజకీయ రంగానికి దూరంగా అట్టిపెట్టి చదువనూ వ్రాయనూ నేర్చిన కొద్దిమంది చేతుల్లో ప్రభుత్వ యంత్రాన్ని ఒప్పగిస్తారు. ప్రజలను మోసగించడానికి ఈ భాషాసూత్రాన్నికూడా ఒక సాధనంగా బూర్జువావర్గం ఉపయోగించుకుంటూంది. కాబట్టి పీడిత ప్రజలందరితో కలిసి హిందీభాషీయులుకూడా ఈ సూత్రాన్ని ఎదుర్కొని పోరాడవలసి ఉంటుంది.

# 5. పోలీసు రాజ్యం

ప్రజలను మోసగించడానికి ఎన్ని కుతంత్రాలు పన్నినా, ఎంత మసిపూసి మారేడుకాయ చేసినా ప్రజలు ఎంతోకాలం యదార్థవిషయాన్ని గ్రహించకుండా ఉండరు. అసలుగుట్టు కాస్తా గ్రహించినప్పుడు ప్రజాహృదయాలలో క్రోధాగ్ని రగుల్కొనకమానదు. యీ విషయం సామ్రాజ్యవాదులకూ, పెట్టుబడిదారులకూ కాంగ్రెసునాయకులకూ తెలియకపోలేదు. ప్రజలను మోసగించడానికి వారు పన్నిన వలలన్నీ పటాపంచలయిపోతాయని వారికి బాగా తెలుసు.

అందువల్లనే చివరకు ప్రజాతంత్రం అనే ముసుగునుకూడా పూర్తిగా తొలగించి నగ్నస్వరూపంలో బైటపడ్డారు. పోలీసురాజ్యాన్ని - నియంతృత్వ పద్ధతులను - చేపట్టారు.

ప్రజల ప్రాథమిక హక్కుల్లో పికెటింగు చేసే అధికారంకూడా లేకుండా చేశారు. ఏ సమ్మెనయినా చట్టవిరుద్ధంగా ప్రకటించవచ్చు. సమ్మెలో పాల్గొనే కార్మికులపై పోలీసులను తుపాకులను ప్రయోగించవచ్చు, (రైల్వే కార్మికుల సమ్మె సందర్భంలో(మార్చి 9) దాదాపు 3 వేల 500 మంది కార్మికులనూ కార్మికనాయకులనూ అరెస్టుచేయడం, ప్రతి కర్మాగారాన్నీ ఒక పోలీసు క్యాంపుగా మార్చివేయడం ప్రజలకందరకు తెలిసిన విషయమే సం. జ.) "పబ్లిక్‌కు సంబంధించినపనులలో కార్మికులచేత జబర్దస్తీగా ప్రభుత్వం పనిచేయించుకోవచ్చు." అని 27 (2) వ సెక్షన్‌లో స్పష్టంగావ్రాసున్నారు. ఏ పరిశ్రమలోనైనా, ఏ ప్రదేశంలోనైనా సమ్మె తీవ్రతరంగా జరిగే పక్షంలో "పబ్లిక్ లాభంకోసం" అనే పేరుతో సమ్మెదారులను అమానుషంగా అణచివేసి పెట్టుబడిదారీ వర్గ ప్రయోజనాలను కాపాడడానికి కాంగ్రెస్ ప్రభుత్వం నడుంగట్టి పనిచేస్తుంది.

ప్రజలెవరూ ఆయుధాలను ధరించగూడదని నూతన రాజ్యాంగ విధానం శాసిస్తోంది. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు ప్రజలను నిరాయుధులుగాజేసి తమసైనికులకూ పోలీసులకూ మాత్రమే ఆయుధాలిచ్చారు. ప్రజల్లో వ్యాపించే అసంతృప్తిని ఆయుధప్రయోగంద్వారా అణచివేయడమే సామ్రాజ్యవాద ప్రభుత్వవిధానం. బూర్జువా ప్రభుత్వాలుకూడా ఇదే పద్ధతిని అనుసరిస్తాయి. సామ్రాజ్య వాదులతో చేతులు కలిపిన కాంగ్రెసు ప్రభుత్వంకూడా తన సైనికులకూ, పోలీసులకూ 'జాతీయ' అనే ముసుగు తగిలించుకున్న ఫాసిస్టులకూ, హోంగార్డులకూ తాను నమ్మినబంట్లు అయిన పెట్టుబడిదారులకూ, జమీందారులకూ తన తొత్తులైన జాతీయ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు గూండాలకూ ఆయుధాలిచ్చి నిరాయుధులైన ప్రజలపై ప్రజా ఉద్యమాలపై పురికొల్పుతుంది. 1945-46 కాంగ్రెసు ఎన్నికల

మానిఫెస్టోలో "ప్రతి పౌరునికీ ఆయుధాలుంచుకోడానికీ, ధరించడానికీ అధికారం ఉంటుంది" అని వాగ్దానం చేసింది. కాని ఇప్పుడీ వాగ్దానాని కేగతి బట్టిందో ప్రజలకు స్వానుభవైకవేద్యమే.

నూతన రాజ్యాంగవిధానంలో సభా, పత్రికా, వాక్స్వాతంత్ర్యాలకు స్వస్తి చెప్పబడింది. ప్రజల ప్రాథమికహక్కులలో పత్రికా స్వాతంత్ర్యాన్ని గురించిన ఊసు అయినా ఎత్తలేదు. "సభా, పత్రికా, వాక్ స్వాతంత్ర్యాల విషయంలో ప్రస్తుతం ఉన్న చట్టమే (అంటే బ్రిటిషు సామ్రాజ్యవాదులు తయారుచేసిన చట్టం) అమలు జరుపబడుతుంది" అని 13 (3)వ సెక్షన్‌లో పేర్కొనబడింది. "సభా, పత్రికా, వాక్ స్వాతంత్ర్యాల నరికట్టే విషయంలో అవసరం అని తోచినప్పుడు తన యిష్టం వచ్చిన చట్టాన్ని ప్రవేశపెట్టడానికి ప్రభుత్వానికి అధికారము ఉంది." అని కూడా అందులోనే స్పష్టంగా చెప్పేశారు. బ్రిటిష్ ప్రభుత్వ హయాంలో అడుగడుగునా ప్రజల నోటికి తాళము వేసిన 124వ సెక్షనూ (రాజద్రోహము) 'ప్రెస్సు యాక్టూ,' 'వర్గద్వేషమూ' మొదలైన నిర్బంధ చట్టాలన్నిటినీ కాంగ్రెసు ప్రభుత్వం యథారీతిగా స్వీకరించింది.

ప్రజావాణి ఎక్కడా వినిపించకుండా అరికట్టేందుకు 'గూండా చట్టాలూ' (బొంబాయి రాష్ట్రం) 'ప్రజారక్షణ (భక్షణ) చట్టాలూ' 144 వ సెక్షన్‌లూ, ఆర్డినెన్సులూ ప్రజల నెత్తిపైకెక్కి ప్రళయతాండవం చేస్తున్నాయి. పిలిస్తే పలుకుతున్నాయి. వారంటు లేకుండా అరెస్టులూ విచారణ లేకుండా జైళ్ళల్లో కుక్కడం కాంగ్రెసు ప్రభుత్వ హయాంలో నిత్యకృత్యాలైపొయ్యాయి. పోలీసే 'స్వయం రాజా స్వయం మంత్రీ' అయ్యాడు. ప్రజల మాన ప్రాణాలు పోలీసుల అధీనమయ్యాయి. భారత దేశంలో కాంగ్రెసు స్థాపించబోయే ప్రజాస్వామికం ఎలా ఉంటుందో ప్రజలిప్పటినుంచే రుచి చూస్తున్నారు.

సభా సమావేశాలూ, ప్రదర్శనలూ జరుపుకోడానికి ప్రజల కధికారంలేదు.

కొద్దీ గొప్పఉన్న అధికారాలను కూడా ప్రభుత్వం ఏ నిమిషంలోనైనా మరో ఆర్డినెన్సు ప్యాసుచేసి స్వాతంత్ర్యదేవిని కాళ్ళూ చేతులూ కదలకుండా కట్టివేస్తారు. ఆవిధంగా తన ఇష్టం వచ్చిన చట్టాలు- ఆర్డినెన్సులు- ప్యాసు చేయడానికి ప్రభుత్వానికి సంపూర్ణాధికారం ఉంది. (చూడండి 93 (3) వ సెక్షన్)

ప్రజలకు సంఘ స్వాతంత్ర్యం కూడాలేదు. ప్రభుత్వం తన ఇష్టం

వచ్చిన సంఘాన్ని ఎట్టిరుజువు లేకుండానే చట్టవిరుద్ధంగా ప్రకటించవచ్చు. (అలా ప్రకటిస్తూనే ఉన్నారుకూడా) పెట్టుబడిదారీ వర్గ ప్రయోజనాలకు వ్యతిరేకంగా పనిజేసే ప్రతిసంఘాన్ని గొంతునులిమివేస్తారు. అంతగా ఇప్పుడున్న నిర్బంధ చట్టాలన్నీ చాలకపోతే మరుక్షణంలో కొత్త నిర్బంధ చట్టాలను ప్రవేశపెట్టడం వాళ్ళ చేతుల్లో పని.

**కేసూ, విచారణ లేకుండా ఎవరినీ జైల్లో నిర్బంధించగూడదు. ఇది ప్రజల ప్రాథమిక హక్కుల్లో అత్యంత ప్రధానమైన సూత్రం. కాని దీన్నికూడా నూతన రాజ్యాంగ విధానం హరించివేసింది.**

నూతనరాజ్యాంగం ఇంకా అమల్లోకి రాకముందే ఆర్డినెన్సులమీద ఆర్డినెన్సులు జారీచేసి విచారణ లేకుండా జైల్లో పెట్టడం మామూలైపోయింది.

## గవర్నర్లకు ప్రత్యేకాధికారాలు

శాసనసభా సమావేశాలు జరగకుండా ఉన్న సమయంలో ఏ సమస్యమీదనైనా సరే గవర్నర్ తనఇష్టం వచ్చిన ఆర్డినెన్సు జారీచేయవచ్చు. శాసనసభా సమావేశం ప్రారంభమైన తర్వాత 6 వారాలవరకూ ఈఆర్డినెన్సు అమల్లోఉంటుంది. (187 వ సెక్షన్) ఇండియన్ యూనియన్ ప్రెసిడెంటుకుకూడా ఇదే విధంగా ఆర్డినెన్సులు జారీచేసే అధికారముంది. (102 వ సెక్షన్) ఆర్డినెన్సు అంటే ఏమిటో భారతీయులు తమ నిత్యానుభవంలో స్వయంగా చూస్తూనే ఉన్నారు. భావిభారతదేశంలో కూడా ఈ ఆర్డినెన్సు పరిపాలన తప్పదు.

ఈ నిర్బంధచట్టాలన్నీ అసాధారణ పరిస్థితుల్లో గాకుండా సాధారణ పరిస్థితులలోనే ప్రవేశపెట్టబడుతున్నాయి. ఇందుకసంతృప్తిని తెలియపరుస్తూ ప్రజల నోటినుంచి ఏదైనా మాటజారిందా తలపై లాఠీ తాండవం చేసిందన్నమాటే.

## ఇండియా ప్రెసిడెంటు ఒక హిట్లరు

భారత ప్రజల్లో రోజురోజుకూ అభివృద్ధి చెందుతోన్న చైతన్యాన్ని, అసంతృప్తిని అణచివేయడానికిమామూలు నిర్బంధ చట్టాలు చాలనిచో ప్రభుత్వం తన ప్రత్యేకాధికారాలను చలాయిస్తుంది.

188 వ సెక్షన్ ప్రకారం పరిస్థితులు విషమంగా ఉన్నాయని గవర్నరు నమ్మినపక్షంలో అసలు శాసనసభలనే రద్దుజేసి గవర్నరే స్వయంగా నియంతృత్వాధికారాలు చలాయించవచ్చు. ఈ ప్రత్యేకాధికారాలు అమలు జరపడానికి రెండు వారాలు ముందుగా గవర్నర్లు భారతయూనియన్ ప్రెసిడెంటుకు తెలియజేయవలసి ఉంటుంది. అలా తెలియజేసిన తర్వాత ప్రెసిడెంటు తన చిత్తం వచ్చినట్లు వ్యవహరించవచ్చు. రాష్ట్రాలకు చెందిన ఏ అధికారాన్ని అయినా ప్రెసిడెంటు గుంజుకోవచ్చు. అలాగుంజుకున్న అధికారాన్ని తన యిష్టం వచ్చిన ఏ అధికారికి అయినా కట్టబెట్టవచ్చు.

## నిరంకుశాధికారాలు

ఈఅధికారాలేకాకుండా ప్రెసిడెంటు ఎన్నిక జరగక పూర్వం ప్రస్తుతం ప్రెసి

డెంటుగా ఉండే అతనికింకా అనేక నియంతృత్వాధికారాలుంటాయి.

యుద్ధ పరిస్థితులుగానీ, అంతర్యుద్ధ పరిస్థితులుగానీ ఏర్పడ్డాయని ప్రెసిడెంటు నమ్మినట్లయితే ఒక్క ప్రకటనతో—ఒక్క కలం పోటుతో—ఈ క్రింద నుదహరించిన వాటినన్నిటినిగానీ, లేకకొన్నిటినిగానీ అమలు పరిచే అధికారం అతనికి ఉంటుంది.

1. ఏ ఒక రాష్ట్రంయొక్క అధికారాలనుగానీ లేక అన్ని రాష్ట్రాల అధికారాలనుగానీ అతను హస్తగతం చేసుకోవచ్చు. (276వ సెక్షన్) ఏరాష్ట్రంనుంచి అయినా రివిన్యూ వసూలుచేసే అధికారాన్ని రాష్ట్రానికి లేకుండా చేయవచ్చు. (277 వ సెక్షన్)

2. పౌరసత్వాలన్నిటినీ—హైకోర్టుల్లో హేబియస్ కార్పస్ పిటిషన్ దాఖలుచేసే అధికారంతోసహా - పూర్తిగా గుంజుకోవచ్చు. (276, 280 సెక్షన్లు)

3. నూతన రాజ్యాంగ విధానం ఏ ఒక రాష్ట్రంలోగానీ లేక అన్ని రాష్ట్రాల్లోగానీ అమలు జరగకుండా అరికట్టవచ్చు. (279 సెక్షన్)

4. కేంద్ర పార్లమెంటు నిర్ణయాన్ని బట్టి తనకున్న ఏ అధికారాన్ని అయినా, లేక అధికారాలన్నిటినైనా ప్రస్తుత ప్రభుత్వానికి లేక ప్రభుత్వాధికారులకు ఒప్పచెప్పచవచ్చు. అంటే పార్లమెంటులో మెజారిటీపార్టీ 'అసాధారణ పరిస్థితి' అనే సాకుతో రాజ్యాంగచట్టాన్నే పూర్తిగా రద్దుచేసి వేయవచ్చు. (276 బి. సెక్షన్)

కేంద్రపార్లమెంటు ఆమోదం లేకుండానే ప్రెసిడెంటు చేతిలో ఈ నియంతృత్వాధికారాలూ వాటి నసరాగా తీసుకొని 'అసాధారణ' పరిస్థితి సాకుతో ప్రెసిడెంటు జారీచేసే ఉత్తరువులూ ఆరు మాసాలుదాకా అమల్లో ఉంటాయి. సంవత్సరానికొకసారి పార్లమెంటు అంగీకారాన్ని బడసి ఈ 'అసాధారణ పరిస్థితి'ని మూడు సంవత్సరాలదాకా పొడిగించవచ్చు. (275 వ సెక్షన్)

**ఈ విధంగా నియంతృత్వం చలాయించడానికి నిజంగా యుద్ధ పరిస్థితులుగానీ, అంతర్యుద్ధ పరిస్థితులుగానీ ఉండవలసిన అవసరం లేదు. "ప్రమాదంరాబోతూఉంది" అని ప్రెసిడెంటుకు సందేహం కలిగితే చాలు ఒక్క కలంపోటుతో రాజ్యాంగ చట్టాన్ని రద్దుజేసి 'డిక్టేటరు'గా మారిపోతాడు.**

ఈరోజు మాటకుముందు 'అసాధారణ పరిస్థితి' అనే పేరుతో ప్రజారక్షణ చట్టాన్ని ప్రయోగించి ప్రజలపై అమానుష హింసాకాండ జరపడం మామూలై పోయింది. ఈ ప్రజారక్షణచట్టం నానాటికి ఇంకా అధ్వాన్నంగా మారుతుందే కాని ఇక ఇది తిరుగుముఖం పట్టేదికాదు.

# 6. నిజమైన ప్రజాతంత్ర విధానంకోసం పదండి! ముందుకు పదండి!

**భారతీయ ప్రజానీకాన్ని కాళ్ళూ చేతులూ కదలకుండా బంధించే గొలుసే ఈ నూతన రాజ్యాంగ విధానం.**

ఈ రాజ్యాంగవిధానం క్రింద ఏర్పడే ప్రభుత్వం పెట్టుబడి దారుల- దోపిడి దారుల - ప్రభుత్వంగానే ఉంటుంది. నిజమైన ప్రజాతంత్ర విధానానికి బద్ధవిరోధిగా ఉంటుంది. వోటింగు హక్కూ- శాసనసభలూ ఇవన్నీ కేవలం బూటకాలు. ఈ తతంగమంతా కొంతకాలం ప్రజలను మోసగించడానికే ఉపయోగపడుతుంది. ఒకవేళ శాసన సభలకు (క్రింది సభలకు) నిజమైన ప్రజాప్రతినిధులు ఎన్నుకోబడడం జరిగినా పెట్టుబడిదారీ వర్గ ప్రయోజనాలను అరికట్టడానికిగానీ ప్రజాప్రయోజనాలను కాపాడడానికి గానీ ఏమాత్రం అధికారం ఉండదు. ఎందుకంటే నూతనరాజ్యాంగ విధానం ప్రకారం ఏవర్గం అధికారంలోకి వచ్చినా పెట్టుబడిదారుల భూస్వాముల పరిశ్రమలను గానీ, భూములను గానీ స్వాధీనం చేసుకోడానికి జాతీయం చేయడానికీ ఈ చట్టంలో ఎలాంటి ఆస్కారమూ లేదు. (243 వ సెక్షన్)

ఈ నూతన రాజ్యాంగం ఫలితంగా దున్నేవారికి భూమి లభించకుండా పోతుంది. నిజాంలాంటి నవాబులనూ రాజప్రముఖులనూ తుదముట్టించకుండా వారికి దగిన రక్షణ కల్పించబడుతుంది. పరిశ్రమలను జాతీయం చేయడమంటూ జరగదు. విదేశపెట్టుబడి విదేశ పెట్టుబడిదారుల అధికారము భారత ప్రజలపై నిరాఘాటంగా కొనసాగుతూనే ఉంటుంది. విదేశీ పెట్టుబడిదారుల దోపిడికి కూడా ఈ రాజ్యాంగంలో తగిన సదుపాయాలు కలిగించడం ఒక ప్రాథమిక హక్కుగా అంగీకరించ బడడమే ఇందుకు కారణం. పార్లమెంటులో ఏ గ్రూపు మెజారిటీలో ఉన్నా ఈ రాజ్యాంగ పాఠం ప్రకారం బ్రిటిష్ ప్రభుత్వ హయాంలో అయిన అప్పు 'తాతా'ల అప్పు, ప్రతిసంవత్సరం రైల్వేలద్వారా చెల్లించే అప్పూ, పెట్టుబడిదారులతో పొత్తుగలసి ప్రభుత్వం నెలకొల్పే పరిశ్రమల అప్పులూ వీటన్నిటినీ వడ్డీతో సహా ముట్టజెప్పవలసిందే. ఈ విషయాల్లో పార్లమెంటుకు వోటుజేసే అధికారం కూడా లేదు.

● ఇక ఇతర చిన్నచిన్న విషయాలనుబట్టి చూచినా ఈ రాజ్యాంగం అభివృద్ధి నిరోధకం అని తేటతెల్లమవుతుంది. ఇండియా, బ్రిటిష్ పెట్టుబడిదారుల స్వార్థ లాభాలకే ఇది ఉపయోగ పడుతుంది. ఉదాహరణకు పన్ను విషయమే తీసుకోండి. ఎంత పెద్దవ్యాపారం చేసినా వారిపైనబడే పన్ను 250 రూపాయలకు మించదట! బ్రిటిష్ పెట్టుబడి దారుల ఆజ్ఞలను బానిసల్లాగా కాంగ్రెసు నాయకులు శిరసావహిస్తున్నారు. ఎన్నిక నాటకంలో ఏ గ్రూపు గెల్చినా అస ప్రధానవిషయాల్లో వచ్చే మార్పేమీలేద

● ఇక ఎన్నికల నాటకంలో ఎంతపస ఉందో చూడండి! బ్రిటిష్

ప్రభుత్వ కాలంనాటి తొత్తులనేసుస్థిరంగా ఆయా పదవుల్లో ఉంచడంగానీ, ఆనాటి సైనిక బలాన్ని, పోలీసు విధానాన్ని చెక్కు చెదరకుండా అట్టిపెట్టడంగానీ, కౌన్సిలును తమ యిష్టంవచ్చినట్లు సభ్యులను నామినేట్ చేయడంగానీ, ప్రెసిడెంట్ పదవికి ప్రత్యక్ష ఎన్నికలు జరపకుండా అతనికి నియంతృత్వాధికారాలన్నీ హస్తగతం చేయడంకానీ-వీటన్నిటినీ పరిశీలించిచూస్తే భారతరాజ్యాంగయంత్రంపై ఇండియా పెట్టుబడిదారుల అధికారమూ వారి యజమానులైన బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పెత్తనమూ పూర్తిగా ఉంటుందని ఎటువంటి మందబుద్ధికికూడా స్పష్టంగా బోధపడుతుంది.

● ఈనూతన రాజ్యాంగచట్టంక్రింద పీడిత ప్రజానీకానికి, మధ్యతరగతి ప్రజలకు తమ కార్యక్రమాన్ని కొనసాగించుకోడానికిగానీ, యూనియన్‌లు నిర్మించుకోడానికిగానీ, సమ్మెలు చేయడానికిగానీ, స్వార్థపరులైన దోపిడి దొంగలకు వ్యతిరేకంగా వారి హింసాచర్యల నరికట్టేందుకు ఆయుధాలు చేపట్టడానికిగానీ, పత్రికల ద్వారా, సభలద్వారా తమ మనోగత భావాలను స్పష్టంగా వెల్లడిచేయడానికిగానీ ఎట్టి అధికారంలేదు.

● ఈ నూతన రాజ్యాంగం భారతదేశాన్ని ఒక పెద్ద బందిఖానాగా మారుస్తుంది. కేసు లేకుండానే జైల్లో బంధించడం నేడొక చట్టసమ్మతమైన చర్యగా పరిగణించబడుతోంది. అవసరమైనప్పుడు బూర్జువావర్గం ఈ రాజ్యాంగచట్టాన్ని బుట్టదాఖలుచేసి తన అసలురంగైన నియంతృత్వ రూపంలో బైట పడుతుంది.

● నిజమైన ప్రజాతంత్రాధికారాలను చేపట్టినప్పుడే - ఈ నూతన రాజ్యాంగపాఠాన్ని చించి అగ్నిహోత్రునికి స్వాహాచేసినప్పుడే ప్రజలు నిజమైన ప్రజా ప్రభుత్వాన్ని స్థాపించుకోగలరు. తలా తోకలేని నిరుపయోగకరమైన యీ రాజ్యాంగపాఠంపై భారత రాజ్యాంగ పరిషత్తులో జరిగే శుష్కవాదోపవాదాలను వింటూ ఉంటే ప్రజల హృదయాల్లో క్రోధాగ్ని రగుల్కొంటోంది. అందువల్లనే కాంగ్రెసునాయకులు ఈ వాదోపవాదాలను సత్వరంగా ముగించి ఈ అభివృద్ధి నిరోధక రాజ్యాంగవిధానాన్ని ఆసరాగా తీసుకొని కొత్తగా ఎన్నికలు జరపడానికి సన్నాహాలు చేస్తూ ఉన్నారు. ఎన్నికల హడావుడిలో ఈ కుళ్ళునంతా కప్పిపుచ్చాలనుకుంటున్నారు. దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలనే ఉద్దేశంతో ప్రజలింకా పూర్తిగా కండ్లు విప్పకముందే ఈ దిక్కుమాలిన రాజ్యాంగ చట్టాన్ని ప్రజల నెత్తిపై రుద్ది తద్వారా లభించే నియంతృత్వాధికారాలతో ప్రజా ఉద్యమాన్ని నిర్మూలించి వేయాలని చూస్తున్నారు.

## ప్రజాస్వామిక మూల సూత్రాలు

కాంగ్రెసు నాయకులుచేసే ఈమోసాన్ని అంతా ప్రజలు త్వరత్వరగా గ్రహిస్తూనే ఉన్నారు. కాని అభివృద్ధినిరోధకుల ఆటలు పూర్తిగా కట్టించాలంటే ప్రజలింకాముందుకు వచ్చి కార్యరంగంలో దిగాలి.

**చురుకుగా పని చేయాలి. తమలో ఐక్యశక్తి పెంపొందించుకోవాలి. ఈ విధానాన్ని తుత్తునియలు చేయడానికి తీవ్రంగా పోరాడాలి. రాజ్యాంగపాఠాన్ని అగ్నికాహుతి చేయాలి అనే నినాదం నలుమూలలా ప్రతిధ్వనించాలి. నిజమైన ప్రజాతంత్ర విధానంకోసం కటిబద్ధులై యుద్ధరంగానికురకాలి.**

నిజమైన ప్రజాతంత్ర మూలసూత్రాలనగా ఏవి ?

1. బ్రిటిష్ సామ్రాజ్యవాదులతో పూర్తిగా తెగతెంపులు చేసుకొని దేశానికి నిజమైన స్వాతంత్ర్యాన్ని సాధించడం;

2. బ్రిటిష్ అమెరికా సామ్రాజ్యవాదులతో సంబంధాలు పెట్టుకోడానికి బద్ధవిరోధిగానూ, సమస్త దేశాల శాంతిస్వాతంత్ర్యాలకోసం పాటుపడే నిజమైన ప్రజాతంత్ర రాజ్యాలకు పరమ మిత్రుడుగానూ ఉండే ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని - కష్టజీవులైన కార్మిక కర్షకుల, అణచబడిన మధ్యతరగతి ప్రజల ప్రతినిధులతో కూడిన నిజమైన ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని - నెలకొల్పడం.

3. ప్రజా సామాన్యానికి సంపూర్ణ స్వాతంత్ర్యమూ, ఆర్థికాధికారాలూ గ్యారంటీచేసే ప్రాతిపదికపై వయోజన వోటింగుతో, దామాషా ప్రాతినిధ్యంతో ప్రజాస్వామిక రాజ్యాంగ విధానాన్ని నిర్మించడం ;

4. అల్ప సంఖ్యాకులు కోరే న్యాయసమ్మతమైన ప్రజాస్వామిక హక్కులను రాజ్యాంగ పాఠంలో చేర్చడం, వారి భాషా సంస్కృతులను కాపాడడం, సర్వ మానవ సమాన హక్కులను ఆమోదించడం, అమలుజరపడం, జాతి మత వర్ణ భేదాల ద్వారా సంక్రమించే ప్రత్యేకాధికారాలన్నింటినీ తుదముట్టించడం, ఈ చట్టాన్ని ఉల్లంఘించే వారందరినీ శిక్షార్హులుగా పరిగణించడం ;

5. విడిపోయే హక్కుతోసహా జాతులన్నింటికి స్వయంనిర్ణయహక్కు నివ్వడం, వివిధజాతులు ఐచ్ఛికంగా జేరిన యూనియన్ను ఏర్పరచడం, భాషాప్రయుక్త రాష్ట్రాలను నిర్మించడం, రాష్ట్రాలకు స్వపరిపాలనాధికారాన్ని అంగీకరించడం,

6. సంస్థానాధీశులైన నవాబులకు రాజులకు జాగీర్దార్లకు స్వస్తిచెప్పి ఆ ప్రాంతాల్లో నిజమైన ప్రజాతంత్ర విధానాన్ని నెలకొల్పడం,

7. సంఘంలో వెనకబడి ఉన్న జాతులనూ, ఆదివాసి ప్రజలనూ ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక దోపిడినుంచి విముక్తి చేసి వారికి సంపూర్ణ ప్రజాస్వామిక హక్కులివ్వడం, అభివృద్ధి చెందిన తదితర జాతులతోపాటు వారుకూడా సమానంగా అభివృద్ధిచెందేందుకు ప్రభుత్వంనుంచివారికి సంపూర్ణ సహాయం లభించడం, ప్రాదేశికైక్యత కలిగిన ఆదివాసి ప్రాంతాలకు స్వపరిపాలనాధికారాన్నివ్వడం, (రాష్ట్రాలకు లోబడి వారు తమ ప్రదేశాలలో స్వపరిపాలన సాగించుకోవడం) ఈ ప్రదేశాల్లో ప్రజలు తమ ప్రభుత్వాన్ని నిర్మించుకోడానికి - అందులోనూ ముఖ్యముగా ఆర్థిక సాంస్కృతిక విషయాల్లో తమ ఇష్టం వచ్చిన ప్రభుత్వాన్ని నిర్మించుకోడానికి - వారికి పూర్తిగా స్వేచ్ఛనివ్వడం, ఆయా ప్రదేశాలనుబట్టి అవసరమైతే

వాటిని రాష్ట్రాలుగాకూడా గుర్తించడం; వారికి విడిపోయేహక్కునుకూడా (వారి అభిప్రాయాన్ని తెలుసుకొని) ఇవ్వడం,

8. ఇండియా పాకిస్తాన్ దేశాల్లో నివసించే కష్టజీవులైన ప్రజల శ్రేయస్సు కోసం ఈ ఉభయదేశాల మధ్య పరస్పర ఆర్థిక సహకారం నెలకొనడం, సామ్రాజ్యవాదుల పెత్తనానికీ విదేశదాడులకు వ్యతిరేకంగా ఈ రెండు దేశాల మధ్య సైనికంగా రాజకీయంగా సత్సంబంధాలేర్పడడం; బ్రిటిష్ అమెరికా సామ్రాజ్య వాద ముఠాకు వ్యతిరేకంగా ఈ రెండు దేశాలు ప్రజాతంత్రయుతమైన విదేశాంగ నీతి నవలంబించడం,

9. ఎట్టి ప్రతిఫలం ముట్టజెప్పకుండా జమీందారీలను స్వాధీనపరచుకోవడం, దున్నేవారికే భూమి లభించేవిధంగా భూమిని పునర్విభజించడం, స్వయంగా కష్టపడి సాగుచేయని జమీందారుల స్వంత కమతాలను కూడా స్వాధీనం చేసుకొనడం, పాలుకు పనిజేసే రైతులకే భూమిపై హక్కు కలిగించడం, గ్రామీణులను రుణభారంనుంచి విముక్తులను చేయడం, వడ్డీ వ్యాపారాన్ని పూర్తిగా నిషేధించడం, వ్యవసాయ కూలీలకు జీవనయోగ్యమైన జీతాలు ఏర్పాటు చేయడం;

10. బ్యాంకులూ, పరిశ్రమలూ, రవాణాసాధనాలూ, గనులు వగైరాల్లో విదేశీ పెట్టుబడిదారులు పెట్టిన పెట్టుబడిని స్వాధీన పరచుకొనటం వాటిని జాతీయం చేయడం;

11. భారీపరిశ్రమలనూ బ్యాంకులనూ భీమా కంపెనీలనూ జాతీయం చేయడం, వాటిని కార్మికుల యాజమాన్యంలో ఉంచడం, కార్మికులకు జీవనయోగ్యమైన వేతనాలివ్వడం, రోజుకు 8 గంటల పనినమలుజరపడం;

12. దేశాభివృద్ధికోసం ఆర్థిక ప్రణాళికను తయారు చేయడం, ఆర్థిక రంగంలో కీలకస్థానాల్లోఉన్న పెద్దపెద్ద పెట్టుబడిదారులను ఆ యా స్థానాలనుంచి తొలగించడం;

13. నిర్బంధ చట్టాలన్నిటిని రద్దు చేయడం;

14. నియంతృత్వాధికారయుతమైన ఈ రాజ్యాంగ విధానాన్ని విధ్వంసంచేసి ఆ స్థానంలో ప్రజాకమిటీల ద్వారా నడపబడే ప్రజాతంత్ర విధానాన్ని స్థాపించడం, ఈ విధానంలో ప్రతి కమిటీ సభ్యునీ ప్రజలే ఎన్నుకోడం;

15. ప్రజాతంత్ర పద్ధతులపై నిర్మించిన ప్రజాసైన్యాన్ని కేంద్రం ద్వారా సాయుధులుగా చేయడం;

16. ఉచితంగా విద్య నేర్చుకోడానికి ప్రతి వ్యక్తికీ హక్కుండడం, ప్రతిపౌరునికి ప్రాథమిక విద్య గరిపేందుకు ప్రభుత్వం గ్యారంటీ నివ్వడం;

17. పురుషులతోపాటు స్త్రీలకు కూడా సర్వసమానాధికారాలు. ఇవే నిజమైన ప్రజాతంత్రానికి మూలసూత్రాలు.

— "మార్క్సిస్టు మిసిలేనీ" నుండి



# శాంతికోసం పోరాటం

మారిస్ థోరే

[1949 మార్చి 10 వ తేదీన ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ మారిస్ థోరే పార్టీ జాతీయ మహా సభలో చేసిన తుదిఉపన్యాస సంగ్రహాన్ని ఫ్రెంచి కమ్యూనిస్టు దిన పత్రిక "లాహ్యూమనైట్" ఏప్రిల్ 10 వ తేదీన ప్రకటించింది. అందులోని కొన్ని భాగాలను యీ క్రింద ప్రచురిస్తున్నాం.]

— సంపాదకవర్గం

యుద్ధాన్ని ఖచ్చితంగా తప్పించాలంటే సోషలిజంకోసం పోరాడటం ఒక్కటే ఏకైక మార్గం ... ఈ విషయం ప్రతి కమ్యూనిస్టుకూ తెలిసి వుండాలి. —ఇది మనసిద్ధాంతంలో ఒక ప్రధాన సూత్రం.

జ్యూరిస్ యిలా అన్నాడు:

"తుపానుతోపాటు తప్పనిసరిగా ఉరుములు మెరుములతో కూడిన మేఘం ఎలా వుంటుందో అలాగే పెట్టుబడిదారీ విధానంతోపాటు తప్పనిసరిగా యుద్ధం వుండి ఉంటుంది."

పెట్టుబడిదారీ విధానం —దాని అంతిమ దశ అయిన సామ్రాజ్యవాద దశలో — అదే దాని శిథిలావస్థదశకూడా — దానికి లోపలా బయటావున్న పరస్పర వైరుధ్యాలు విపరీతమై తప్పనిసరిగా కొత్త యుద్ధాలకు దారితీస్తుంది.

1921 లోనే ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ వ్యవసాయ కార్యక్రమంపై వ్యాఖ్యానించుతూ లెనిన్ యిలా అన్నాడు:

"అమెరికాకు జపానుకూ (లేక ఇంగ్లండుకు) మధ్యపోసగబోతున్న నూతన యుద్ధం— పెట్టుబడిదారీ విధానంఅభివృద్ధి

అవుతున్నకొద్దీ యుద్ధం తప్పని సరి కాకతప్పదు - పెట్టుబడి దారీ ఫ్రాన్సునుకూడా తప్పని సరిగా ఆవరించుతుంది. ఎందు వల్లనంటే యీ సామ్రాజ్య వాద యుగంలో సామ్రాజ్య వాదులు చేసిన ఘోరాతి ఘోర చర్యలన్నింటిలో ఫ్రాన్సుకుకూడా భాగముంది. అందువలన ఫ్రెంచి కార్మిక కర్షకుల ఎదుట రెండే రెండు మార్గాలు స్పష్టంగా కనపడు తున్నాయి. అందులో ఏదో ఒకటి అనుసరించి తీరాలి. అంతకు మినహా గత్యంతరం లేదు. అది ఇది: ఫ్రెంచిసామ్రా జ్యాన్ని "రక్షించుకోడానికి" ఒకకొత్త యుద్ధాన్ని లేక వరు సనే యుద్ధాలను చేయవలసి ఉంటుంది లేక సోషలిస్టు విప్లవానికి సిద్ధపడవలసి ఉంటుంది.

సరిగ్గా అదే దశలో కామ్రేడ్ స్టాలిన్ "ప్రవద"లో యిలా రాశాడు :

"నేడు పెట్టుబడిదారీవర్గాల లోని వివిధ గ్రూపుల మధ్య వున్న వైరుధ్యాలకూ మిలిటరీ తగాయిదాలకూ పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా శ్రామికవర్గం జరుపుతున్న పోరాటాలకూ అసలు పునాది ఒకటేవున్నది. అదేమంటే ఉత్పత్తి శక్తులకూ, ఉత్పత్తి అభివృద్ధికీఉన్న జాతీయ, సామ్రాజ్యవాద పరిమితులకు మధ్యనున్న సంఘర్షణే. ఉత్పత్తి శక్తులకూ పెట్టుబడి దారీ దోపిడీ విధానాలకూ మధ్యనున్న సంఘర్షణే. సామ్రాజ్యవాద పరిమితులూ, పెట్టుబడిదారీ పద్ధతులూ ఉత్పత్తి శక్తులను కొంచపరచి వాటిని అభివృద్ధికాకుండా ఆటంకపరుస్తాయి."

ఈ ప్రధానమైన వైరుధ్యానికి పెట్టు బడిదారీ విధానంలో పరిష్కార మార్గము లేదు. అందువలన ప్రస్తుతం సామ్రాజ్య వాద శిబిరానికీ, ప్రజాస్వామిక, సోష లిస్టు శక్తుల శిబిరానికీ మధ్య రోజురోజుకు ఎక్కువగుతున్న పోరాటంలో ఇది స్ఫుటమవుతున్నది. ఈ ప్రధాన పరస్పర విరుద్ధత ఫలితంగానే అక్టోబరు సోషలిస్టు విప్లవం విజయం పొందింది. కొన్ని దేశా లలో ప్రజాస్వామిక ప్రజాతంత్ర ప్రభు త్వాలు ఏర్పడ్డాయి. వీటన్నిటి ఫలితంగా నేడు సోషలిస్టు శక్తులబలం పెరిగింది. పెట్టుబడిదారీ దేశాలలోని కార్మికవర్గాల విప్లవోద్యమాలకు మరింత ప్రోత్సాహం కలిగింది. సామ్రాజ్యవాదుల బానిసత్వా నికి వ్యతిరేకంగా వలసదేశాల ప్రజల జాతీయ విముక్తి ఉద్యమాల తీవ్రత ఎక్కువైంది.

చరిత్రచే ఖండించబడిన పెట్టుబడిదారీ శక్తుల రక్షణకోసం జరుగుతున్న ప్రయత్నాలను నేడు మనం చూస్తున్నాం. ప్రజల పోరాటాలకు వ్యతిరేకంగా, ప్రజ్వరిల్లుతున్న ప్రజాస్వామిక సోషలిస్టు శక్తులకు వ్యతిరేకంగా పెట్టుబడిదారీ శక్తులు అమెరికా సామ్రాజ్యవాదం యొక్క నాయకత్వాన తమ ఆధిపత్యాన్ని నిలబెట్టుకోడానికి ప్రయత్నించుతున్నాయి. గత కాలానికి చెందిన యీ శక్తులు సోషలిస్టు భూమిని ప్రజాస్వామికానికీ శాంతికీ నిలయమైన దుర్గాన్ని ఎదుర్కొంటున్నాయి.

దీనిని అభివృద్ధి నిరోధక శక్తుల జనరల్ దాడిగా పరిగణించడంకంటే కార్మికోద్యమ వొత్తిడికీ ప్రజాతంత్ర ఉద్యమ వొత్తిడికీ వ్యతిరేకంగా ప్రపంచ అభివృద్ధి నిరోధక శక్తులు తమ ఆధిపత్యాన్ని రక్షించుకోడానికి చేసుకుంటున్న ప్రయత్నంగా ఎంచవచ్చు.

అందుకనే అట్లాంటిక్ ఒడంబడికపై సంతకం పెట్టినవారు ఆ ఒడంబడిక ఆశయం తెలిపే భాగంలో "తమందరికీ సమానంగా చెందిన సాంప్రదాయాలనూ తమ నాగరికతను" రక్షించుకోనే తమ దృఢ నిశ్చయాన్ని తెలియజేశారు. "తమ సాంప్రదాయం నాగరికత" అన్నదానికి అర్థం పెట్టుబడిదారీ నాగరికత, పెట్టుబడిదారీ అరాచకం, వలసదేశ ప్రజలను బానిసత్వంలోముంచి అణచడం, సంక్షోభాలు, నిరుద్యోగం, దరిద్రం, యుద్ధం......వగైరాలన్నమాట. వీటిరక్షణకే వారు పూనుకొన్నారు.

వంతెన ముఖద్వారం పాత్రను నిర్వహించడానికి మన దేశాన్ని తాను అట్టే పెట్టినట్టు అమెరికన్ సైన్యాధికారి జనరల్ బ్రాడ్లే ప్రకటించాడు. వంతెన ముఖద్వారం దాడిచేయడానికి అనువైన కేంద్రంగావినియోగపడుతుందనే విషయం మనందరికీ తెలిసిన విషయమే. మరొక అమెరికన్ మిలిటరీ నిపుణుడు చెప్పినట్లు మనం వంతెన ముఖద్వారంగా వినియోగపడకపోతే "ఆటోమిక్ కుషన్"గా వినియోగపడతాం. యమ్. ఎతిన్నేగిల్సన్ (యం. ఆర్. పి.) యిలా చెప్పాడు. **"అట్లాంటిక్ ఒడంబడిక డాలర్లతో మన రక్తాన్ని కొనడం మాత్రం తప్పదు."** పర్టినెక్స్ యిలా రాశాడు: "అది ఫ్రెంచి జాతీయ స్వాతంత్ర్యానికీ, ఫ్రెంచి ప్రజల రక్తమాంసాదులకు ప్రమాదం తెచ్చిపెడుతుంది. చేతులు ముడుచుకొని చూస్తూ కూర్చోలేము."

యుద్ధం వచ్చే పక్షంలో మన ముందున్న పరిస్థితులివి. మనం ఆశించుతున్నట్లుగా యుద్ధం రాకుండా శాంతి కాముకులు చేస్తున్న ప్రయత్నాలు జయప్రదమైతే - అప్పుడు కూడా అట్లాంటిక్ ఒడంబడిక ఫ్రాన్సు తదితరదేశాలను బానిసత్వంలో ముంచి నాశనంచేసే పరిస్థితికి నెట్టుతుంది.

అసలు సత్యమేమంటే యీ ఒడంబడికలో మనకు చావుమాత్రమే ఉంది. మిమ్ములను నేనొక్కటే అడుగుతున్నాను. ఈ ఒడంబడికలో మన జాతీయ ప్రయోజనాలుకాని, లేక కార్మికవర్గప్రయోజనాలు కాని ఎక్కడైనా వున్నాయా? యీ ప్రశ్నలకు మన పరిపాలకులు సమాధానం చెప్పలేరు. ఒకప్పుడు గ్యూయెడె అన్నట్లు "మన వాదనలకు సమాధానాలు చెప్ప కంటే మనల్ని ఖండించడానికి జడ్జీల సంపాదించడం, మనల్ని బంధించడాని

జైళ్ళను సంపాదించడం వారికి చాల తేలికైన పని!"

మనదేశాన్ని నాశనానికీ, యుద్ధానికీ యీడ్చుతున్నారు. ఇదీ మనం అందరికీ చూపెట్టవలసిన విషయం. మన వ్యతిరేకులు దీనినే అబద్ధాలాడీ, దుష్ప్రచారం సాగించీ, మనల్ని వేటాడీ దాచదలచుకొన్నారు. **ఈపరిస్థితులలో కమ్యూనిస్టుల బాధ్యత ఏమిటి? వివరించి యదార్థాన్ని చెప్పడం, తిరిగి వివరించడం, మళ్ళీ వివరించిచెప్పడం స్పష్టంచేయడం, అందుకు ప్రజలను సమీకరించడం, శాంతికోసం పోరాడే వారికి సహాయపడటం; ఆ విధంగా యుద్ధాన్ని రాకుండా చేయడం. మనం ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ యుద్ధం వచ్చినపక్షంలో 1907 లో స్టూట్‌గార్ట్‌లో సోషలిస్టు అంతర్జాతీయ పక్షం చేసిన తీర్మానం చెప్పిన పద్ధతులననుసరించి యుద్ధాన్ని త్వరగా ఆపడానికి మనం సిద్ధంగా ఉండాలి.**

## సోవియట్ యెడల ప్రదర్శించే వైఖరే శ్రామిక అంతర్జాతీయతకు గీటురాయి

సోవియట్ యూనియన్‌తో ఫ్రెంచి కార్మికుల కున్న గాఢసంబంధాన్నీ ఏకీభావాన్ని కామ్రేడ్ మారిస్ థోరే గట్టిగా తెలియజేశాడు. ఫ్రెంచి కార్మిక వర్గం సోవియట్ యూనియన్‌కు ఎంత రుణపడి వుందో కామ్రేడ్ థోరే విపులంగా వివరించాడు. సోవియట్ కార్మిక కర్షకులు యుద్ధంలోనే గాక 1917 అక్టోబరునుండి అదేపనిగా చేస్తూవచ్చిన త్యాగాలను గురించి కామ్రేడ్ థోరే శ్లాఘించాడు.

సోవియట్ యూనియన్‌లో వున్న మన సోదరులు తమ రక్షణకోసం ఒంటరి మహత్తరమైన పోరాటం సాగించియుండలేదు. మనకోసం కూడా వారుపోరాడారు. దీనిని ఏ కార్మికుడు మరచిపోగలడు? అక్టోబరు విప్లవం అంతర్జాతీయ కార్మికోద్యమానికి చేసిన మహోపకారాన్ని ఏ కార్మికుడు మరచిపోగలడు? లెనిన్ స్టాలిన్ల దేశమైన సోవియట్ యూనియన్ మన తండ్రులూ, మనతాత ముత్తాతలు కనిన కలలను యథార్థంచేసి రక్తమూ, జీవితం యిచ్చిందన్న విషయాన్ని ఏ కార్మికుడు మరచిపోగలడు?

**సోవియట్ యూనియన్ ఎడల ప్రదర్శించే వైఖరే శ్రామిక వర్గ అంతర్జాతీయతకు గీటురాయి.**

ప్రజలను మూడో ప్రపంచయుద్ధంలో ముంచడానికి సామ్రాజ్యవాదులు ప్రయత్నించుతున్నారు. కాని 1914, 1939తో పోల్చిచూస్తే పరిస్థితులు చాల మారిపోయాయి. అందువల్లనే యుద్ధం తప్పనిసరికాదని చెప్పడానికి మనకు వీలవుతున్నది. 1914 లో సోవియట్ యూనియన్ లేదు. బోల్షివిక్ పార్టీ, యింకా అక్కడక్కడ కొంతమందిమాత్రమే విప్లవాత్మక సోషలిజంలో తమ విశ్వాసాన్ని ప్రకటించి [illegible]

తీర్మానాన్ని ఆచరణలో పెట్టారు. 1939లో సోవియట్ యూనియనూ, అనేక దేశాలలో కమ్యూనిస్టుపార్టీలూ వుండటంమూలంగా అప్పటికే శాంతి కాముక శక్తులబలం ఎక్కువగా ఉంది. అందువల్ల యుద్ధాన్ని తెచ్చేందుకు అభివృద్ధి నిరోధకులూ, వారి ఏజంట్లూ శాంతికాముక శక్తులను చీలదీసి, సోవియట్ యూనియన్‌ను ఏకాకి చేయడానికి ప్రయత్నించారు. ఇందుకోసమే వారు మ్యూనిక్ కుట్రను పన్నారు. సామ్రాజ్యవాదుల దురాక్రమణలను అరికట్టడానికి నిరాకరించారు. (అబిసీనియాపై ముసులోని దాడి, రిపబ్లికన్ స్పెయిన్ పై ఫ్రాంకోవిద్రోహం —అనువాదకుడు)

ఇప్పుడో ? యుద్ధంలో ఎంతో నష్టపడవలసి నప్పటికీ సోవియట్ యూనియన్ యిదవరకు ఎన్నడూ లేనంతబలంగా వుంది. అది తన పునర్నిర్మాణ కార్యక్రమాన్ని కొనసాగించుతోంది. ప్రస్తుతం అమలు జరుపుతున్న పంచవర్ష ప్రణాళిక నాలుగేండ్లలో పూర్తి అవుతుంది. సోవియట్ యూనియన్‌తోపాటు ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలు ఆర్థిక రంగంలోనూ, రాజకీయ రంగంలోనూ, త్వరితగతిని అభివృద్ధి చెందుతున్నాయి. పార్లమెంటరీ పద్ధతిలో అవి శ్రామికవర్గ నియంతృత్వ బాధ్యతలను నిర్వహించుతూ సోషలిజానికి పురోగమించుతున్నాయి. ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలలో కార్మికవర్గ పార్టీలు తమ బలహీనతలకూ, తమ వూగిసలాట వైఖరులకూ వ్యతిరేకంగానూ, తమ అనుయాయులలో పెడ త్రోవలకు వ్యతిరేకంగానూ పోరాడుతున్నాయి. సోవియట్ యూనియన్ నిర్వహించే చారిత్రాత్మక పాత్ర యెడల తమ అకుంఠిత విశ్వాసాన్ని ప్రకటించుతున్నాయి. ఇందుకే ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాల యెడల అభివృద్ధి నిరోధకుల ఆగ్రహానికి అంతులేదు. ఈ రాజ్యాలు బూర్జువా జాతీయ వాదానికి వ్యతిరేకంగా శ్రామికవర్గ అంతర్జాతీయ పతాకం క్రింద తమపోరాటాన్ని కొనసాగించుతున్నాయి. కాని టిటో ముఠా జాతీయవాదాన్ని కౌగలించుకొని, ప్రజాస్వామిక, సోషలిస్టు శిబిరాన్నుండి వేరుపడి అభివృద్ధి నిరోధకుల మన్నలను పొందుతుంది.

## శాంతికాముకశక్తుల బలాధిక్యత

ఆ తరువాత కామ్రేడ్ మారిస్ థోరే తన ప్రసంగంలో ప్రపంచమంతటా వెల్లివిరుస్తున్న ప్రజాతంత్రశక్తులనూ జాతీయ విముక్తి ఉద్యమాలను విపులంగా చిత్రించాడు :

చైనాలో, వియత్‌నామ్‌లో, ఇండోనీషియాలో, ఇండియాలో, నల్లఆఫ్రికాలో (ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీ జాతీయ మహాసభకు ఆఫ్రికా ప్రజాతంత్రగ్రూపు ప్రతినిధులు చాలమంది ఆహ్వానించబడ్డారు. వారికి మహాసభా ప్రతినిధులు హర్షధ్వానులతో స్వాగతమిచ్చారు.) ముస్లిం ప్రజానీకం అత్యధికంగావున్న ఉత్తరఆఫ్రికాలో, మడగాస్కర్‌లో, లాటిన్ అమెరికాల అన్నిచోట్లా ఆంగ్లో - అమెరిక సామ్రాజ్యవాదుల కుట్రల యెడ పు వ్యతిరేకత ప్రబలుతోంది. ఉత్తరఅమె లోనూ, చివరకు అమెరికాలోనూ ప్ర స్టెంట్ చర్చీల ప్రతినిధులు తమ మ కోట్ల సభ్యుల పేరిట అట్లాంటిక్ ఒడం యెడల తమ అసమ్మతిని ప్రకటించాడు

యుద్ధాన్ని కోరనివారినందరినీ మనం ఐక్యపరచాలి. ఇదే మన ఆశయంగా ఉండాలి. యుద్ధాన్ని కోరనివారు కాంటోనల్ ఎన్నికలలో మనకు ఓటు చేసినవారికంటే అధిక సంఖ్యాకులుగా ఉంటారు. ఆ ఐక్యసంఘటనలో అన్ని అంశాలలో మనతో ఏకీభవించనివారు సహితము అనేకమంది వుంటారనే విషయాన్ని ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. ఆ విధముగా వివిధ అభిప్రాయాలుగలవారు లేకుంటే ఐక్యసంఘటన అంటూ ఒక యూనియన్ వుండదు,

తరువాత మారిస్ థోరే యిలా అన్నాడు ;

ఈ కాంగ్రెసుకు హాజరుకాని ఎమ్మానుల్ మౌనీర్, క్లాడ్ బోర్డెట్‌లాంటి వ్యక్తులకుకూడ నేను ఉపన్యసించాలని వాంఛించుతున్నా. వారు కమ్యూనిస్టు వ్యతిరేకతకూ, యాంటిసెమిటిజం వైపు లాగబడటానికి నిరాకరించారు. కాని వారు అప్పుడప్పుడు మనల్ని తప్పుగా అర్థంచేసుకొంటారు. వారు మన తప్పులను గురించి, పొరపాట్లను గురించీ అప్పుడప్పుడు మాట్లాడుతూ వుంటారు. అయితే వాటినిగురించి వారు ప్రస్తావించారు.

ఇక పొరపాట్ల మాటా? మేమెన్నడూ పొరపాటు చేయకుండావుంటామని అనం. ఆ విషయం మాకు తెలుసు. కాని వారినొక ప్రశ్న వేస్తున్నాం. మాపార్టీ పుట్టిన తరువాత మన ప్రజల ప్రయోజనాలకూ, ఫ్రాన్సు ప్రయోజనాలకూ విరుద్ధంగా వుండే బ్రహ్మాండమైన తప్పులు ఏమైనా చేశామా? ఆ విషయాన్ని గురించి మీరు చర్చించ దలచారా? మంచిదే? కాని యీనాడు మనకు కావలసినది అదేనా? వాటివలన ఏమి ప్రయోజనం? మమ్మలను ఏమైన అడగండి. మీతో ఐక్యంగా పనిచేయడానికి మేము కొంతవరకు తగ్గడానికి సిద్ధంగానేవున్నాం. మాకు అనవసర గర్వం లేదనే విషయం మీకు యిదివరకే రుజువుచేశాం. అయితే ఒక్క విషయాన్ని మాత్రం మేము వొదులుకోలేము. అందులో మాత్రం రాజీఅంటూ లేదు. మీరు కమ్యూనిస్టులుగా వుండటం మానివేయండని మాత్రం మీరు అడగవద్దు. ముప్పది సంవత్సరాల మా అనుభవం, పోరాటాలూ, యీ ముప్పదిసంవత్సరాల మా జీవితమూ మేము సరియైన పంధాను తీసుకొన్నామన్న మావిశ్వాసాన్ని యింకా ఎక్కువచేసింది. మాలో ప్రతి ఒక్కరూ తాను ఉరితీయబడుతున్న ఉదయాన మాప్రియ కామ్రేడ్ గాబ్రిల్ పెరా ఏమన్నాడో దానినే తిరిగి పునశ్చరణ చేస్తాం:

"మళ్ళీ తిరిగి నేను ఏ పంధాను అవలంబించాలో నిర్ణయించుకొనే అవకాశం లభించితే అప్పుడు కూడా యీనాడు నేనుఅనుసరించిన పంధానే తిరిగి చేబడతాను."

## శాంతికోసం కలసి పనిచేదాం

మాపార్టీకీ, మా ఆశయాలకూ మేము కట్టుబడివుంటాం. మావలెనే మీరుకూడా ఆలోచించి మీ అభిప్రాయాలనూ, మీ విశ్వాసాలను మార్చుకోమని మిమ్మలను కోరము. మేము మిమ్మలను కోరేది ఒక్కటే. అదేమంటే మీరుకూడా మాతో పాటు ఇరువురము ఖండించే పాలసీనివ్యతిరేకించడానికి మాతో ఒడంబడికకు రమ్మని కోరుతున్నాం.మాలాగేమీరుకూడాఅట్లాం

టిక్ ఒడంబడికకు వ్యతిరేకం. వియత్నాంలో యుద్ధాన్ని కొనసాగించడానికి వ్యతిరేకం. సోవియట్ వ్యతిరేక యుద్ధానికీ కమ్యూనిస్టు వ్యతిరేకతకూ ప్రతికూలమే. మన న్యాయస్థానాలు తీవ్రభావాలు గల కార్మికుని శిక్షించి పెట్టుబడిదారులను వదలిపెడతా యనే విషయాన్ని మీరూ అంగీకరిస్తారు. ప్రతిఘటనోద్యమంలో పాల్గొన్న వ్యక్తులను ఖండించి దేశద్రోహులను స్వేచ్ఛగా వదులుతాయని మీరూ ఆమోదిస్తారు.

"మూడో శక్తి" అనేది వట్టి భ్రమ అని మీరూ గుర్తిస్తారు. ఈ రోజున ఫ్రాన్సునూ, ఫ్రెంచి రిపబ్లిక్ నూ, శాంతిని ఎదుర్కొనే ప్రమాదం ఉందని మీరు గ్రహించారు. కాబట్టి మనిద్దరం పవిత్రంగానూ, ప్రధానంగానూ భావించుతున్న ఆశయాలకోసం వాటిని రక్షించేందుకు మిమ్ములను. మమ్ములను ఉత్సాహపరచే మహోన్నత భావాలకోసం జరిగే పోరాటంలో ఎందుకు మీరు మాతో ఐక్యంకారాదు ?

— "వరల్డ్ న్యూస్ అండ్ వ్యూస్" నుండి
ఏప్రిల్ 30



# ప్రజాస్వామిక ప్రజాతంత్రం



యమ్. రకోసి
హంగరీ కమ్యూనిస్టుపార్టీ
ప్రధాన కార్యదర్శి.

ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలు అభివృద్ధిచెంది రోజురోజుకూ బలపడుతున్నాయి. ఆదేశాలలో సోషలిస్టు సమాజ నిర్మాణంకూడా ప్రారంభమైంది. అందువలన ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యానికి సంబంధించిన కొన్ని ప్రధాన సమస్యలు స్పష్టం చేయవలసిఉంది. ప్రజాస్వామిక ప్రజాతంత్రం రెండో ప్రపంచ యుద్ధానంతరం అమలులోకి వచ్చిన ఒక ప్రత్యేక రాజ్యాంగ వ్యవస్థ. ఇదొక నూతన సంఘటన. అందువలవ దీని స్వరూపాన్ని గురించీ, నడకనుగురించీ, అభివృద్ధిపద్ధతిని గురించీ కొన్ని పొరపాటు అభిప్రాయాలు కలిగివుండటం సహజం. మన మార్క్సిస్టు మహోపాధ్యాయుడు కామ్రేడ్ స్టాలిన్ ఉపదేశాల ననుసరించి యీ సమస్యలు కొన్నితర్కించబడి చర్చించబడ్డాయి. తత్ఫలితంగా అవి నేడు స్పష్టంగా తేటతెల్లమయ్యాయి. మనపార్టీలోని బహుసంఖ్యాకులైన ప్రజలు యీ సమస్యలన్నింటినీ పూర్తిగా తెలుసుకొని ఉండటంఅవసరం.

ఇటీవల జరిగిన బల్గేరియా కమ్యూనిస్టు పార్టీ మహాసభలో కామ్రేడ్ డిమిట్రొవ్, పోలిష్ వర్కర్సుపార్టీ మహాసభలో కామ్రేడ్ బిరాట్ యీ సమస్యలను గురించి విపులంగా వివరించారు. రెండో ప్రపంచయుద్ధంలో సోవియట్ యూనియన్ సాధించిన ప్రపంచ ప్రాముఖ్యతగల విజయం ఫలితంగా ప్రజాస్వామిక ప్రజాతంత్ర వ్యవస్థలు ఏర్పడటానికి అవకాశం చిక్కిందని కామ్రేడ్ డిమిట్రొవ్ తెలిపాడు. కార్మికవర్గ నాయకత్వానవున్న అత్యధిక సంఖ్యాకులైన మెజారిటీ ప్రజలూ శ్రామిక ప్రజల అధికారశక్తినిబట్టే ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలలోని రాజ్యాంగయంత్ర స్వభావం నిర్ణయించబడుతుంది. దోపిడువర్గాలకూ, పెట్టుబడిదారులకూ, పెద్దపెద్ద భూస్వాములకూ వ్యతిరేకంగా జరిగే పోరాటంలో యీ రాజ్యాంగయంత్రం ఒక ఆయుధంగా వినియోగించబడుతుంది. ప్రజాతంత్రప్రజాస్వామికం, పెట్టుబడిదారీ వ్యవస్థనుండి సమాజం సోషలిస్టు సమాజానికి పరివర్తన చెందే సమయంలో ఒక తాత్కాలిక వ్యవస్థ మాత్రమే. అప్పుడైనా అది ఖచ్చితంగా సోషలిజానికి దారితీసే రాస్తాపై పురోగమించితేనే అది తన చరిత్రాత్మక పాత్రను నిర్వహించగలుగుతుంది. సోషలిస్టుభూమి అయిన సోవియట్ యూనియన్ యొక్క సన్నిహిత సహకారాన్ని ఆధారం చేసుకొనిమాత్రమే ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యం నెలకొనగలుగుతుంది.

అప్పుడే అది సోవియట్ యూనియన్ నాయకత్వానవున్న సంయుక్త, ప్రజాస్వామిక సామ్రాజ్యవాద వ్యతిరేక శిబిరానికి చెందివుంటుంది.

## ప్రజాస్వామిక ప్రజాతంత్రం: శ్రామికవర్గ నియంతృత్వం

సోవియట్ యూనియన్, ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాల సహాయ ఫలితంగా సోవియట్ విధానం లేకుండానే ప్రజాస్వామిక ప్రజాతంత్ర విధానము మూలంగానే సోషలిజానికి సమాజము పరివర్తన చెందడం సాధ్యమవుతున్నదని కామ్రేడ్ డిమిట్రావ్ తెలిపాడు. ఆయనింకా యిలా అన్నాడు.

"ప్రజాస్వామిక ప్రజాతంత్ర విధానం ...... ఒక నిర్ణీతమైన చారిత్రక సమయములో ...... శ్రామికవర్గ నియంతృత్వంయొక్క విధులనుజయప్రదంగా నిర్వహించగలదు."

బల్గేరియా కమ్యూనిస్టుపార్టీ మహాసభలో తానుచేసిన తుది ప్రసంగంలో కామ్రేడ్డిమిట్రావ్ యీ విషయాన్నే యింకాస్పష్టంగా వెలిబుచ్చాడు.

"మార్క్సు, లెనిన్ల ఉపదేశాల ప్రకారం ప్రజాస్వామిక ప్రజాతంత్ర విధానమూ, సోవియట్ విధానమూ - రెండూ ఒకేశక్తికిగల రెండు స్వరూపాలు మాత్రమే. ఆశక్తే కార్మికవర్గశక్తి. అది పట్టణాలలోనూ, గ్రామసీమల్లోనూ వున్న శ్రామిక ప్రజలందరితోనూ కలసి వారికి నాయకత్వం వహించి నడిపించే కార్మికవర్గ శక్తి. ఈ రెండు విధానాలూ శ్రామికవర్గ నియంతృత్వానికి రెండు రూపాలు."

[బల్గేరియా కమ్యూనిస్టు పార్టీ మహాసభలో కామ్రేడ్ డిమిట్రావ్ యిచ్చిన రిపోర్టు జనత 9వ సంచికలో ప్రచురించబడింది. సం.—జవ]

పోలండ్ కమ్యూనిస్టు నాయకుడు కామ్రేడ్ బీరాట్ కూడా దాదాపు యిదే విధమైన అభిప్రాయాలను వెలిబుచ్చాడు:

"పోలిష్ ప్రజాస్వామిక ప్రజాతంత్రం సోషలిజానికి దారితీసే మార్క్సిస్టు-లెనినిస్టు పంథా యొక్క మారరూపం మాత్రమే."

అతడు యింకా యిలా అన్నాడు;

"మన ప్రజాస్వామిక ప్రజాతంత్ర విధానానికి సోవియట్ యూనియన్ యొక్క స్వార్థత్యాగ పూరితమైన వీరోచిత సహాయమే మూలకారణం. అందువలననే శ్రామికవర్గ నియంతృత్వం జయప్రదంగా సాధించిన విజయాలూ, గడించిన అనుభవాలు మనకు సహాయకారిగా వుంటాయి. ఆ విజయాలనూ, ఆ అనుభవాలను

ఆధారం చేసుకొని ప్రజాస్వామిక ప్రజాతంత్ర విధానం సరిహద్దులలోనే మనం శ్రామిక వర్గ నియంతృత్వ విధులను సక్రమంగా నిర్వహించగలం. ఇదే సోవియట్ విధానానికి మనకూ వున్న ప్రధాన భేదం.” ఆయనింకా యిలా అన్నాడు:

“కార్మిక వర్గనాయకత్వాన శ్రామిక ప్రజల నూతన రాజకీయాధికారమైన ప్రజాస్వామిక ప్రజాతంత్ర విధానమే ప్రస్తుత చారిత్రక పరిస్థితులలో సోషలిజం వైపుకు పురోగమించడానికి చక్కగా తోడ్పడుతుంది.”

సెప్టెంబరులో జరిగిన మన పార్టీ మహాసభకూడా మార్క్సిస్టు సిద్ధాంతాలను బోధించే విషయంలో యిదే రకమైన నిర్ణయాలకు వచ్చింది.

చివరకు తేలిన సారాంశమిది: సోవియట్ యూనియన్ విజయం ఫలితంగా సోవియట్ యూనియన్ సహాయ ఫలితంగా ఏర్పడిన రాజ్యమే ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యం. దాని సహాయంతో శ్రామిక ప్రజలు కార్మికవర్గనాయకత్వాన పెట్టుబడిదారీ విధానాన్నుండి సోషలిజానికి పురోగమిస్తారు. శ్రామికవర్గ నియంతృత్వం నిర్వర్తించే విధులనే ప్రజాస్వామిక ప్రజాతంత్రం కూడా నిర్వహించుతుంది. అయితే దానికి సోవియట్ రూపం మాత్రం వుండదు.

మనపార్టీలో అత్యధిక సంఖ్యాకులకు సిద్ధాంత సమస్యలు తెలియవు. శ్రామిక వర్గ నియంతృత్వం అని చెప్పగానే వారికి సోవియట్ యూనియన్‌లో జరిగిన తీవ్ర అంతర్యుద్ధమో లేక హంగరీ సోవియటు రిపబ్లిక్‌లో చెలరేగిన విప్లవ ప్రతీఘాత తిరుగుబాటో జ్ఞాపకం వస్తాయి. మన ప్రజాతంత్రరాజ్యాంగం శ్రామికవర్గ నియంతృత్వ విధులను ఏవిధంగా నిర్వర్తిస్తుందో వారు అర్థం చేసుకోలేరు. మరికొంతమంది పెట్టుబడిదారీవిధానాన్నుండి సోషలిజంకు పరివర్తన చెందే విషయంలో సోవియట్ అనుసరించిన పంథాను మాత్రమే వూహించగలుగుతున్నారు. కాబట్టి మన మార్క్సిస్టు మహోపాధ్యాయులైన మార్క్సు, ఎంగిల్సు, లెనిన్, స్టాలిన్‌ల ఉపదేశాలనుఆధారంచేసుకొని శ్రామికవర్గ నియంతృత్వ సమస్యపైనా, సోషలిజానికి తీసుకొనివెళ్లేపంథాను గురించిన సమస్యల పైనా కొంత విస్పష్టం చేయడం అవసరం.

## మార్క్సిస్టు - లెనినిస్టు సిద్ధాంతం

అణచబడిన వర్గాలను తమ అదుపులో పెట్టుకోడానికి రాజ్యాంగయంత్రం పాలక వర్గాలకు ఒక సాధనమని మార్క్సు, ఎంగిల్సులు నిరూపించారు. “క్రిటిక్ ఆఫ్ ది గోథా ప్రోగ్రామ్” అన్న తన గ్రంథంలో మార్క్సు జర్మన్ సోషల్ డెమాక్రట్లను

1875 లో దీనినే వివరించాడు. రాజరికం లోనూ, సామ్రాజ్యంలోనూ మాత్రమే రాజ్యాంగయంత్రం బూర్జువా నియంతృత్వ సాధనంగా వుంటుందనీ, ప్రజాతంత్ర రిపబ్లిక్‌లో అలా వుండదనే అభిప్రాయం సోషల్ డెమోక్రట్లలో ప్రబలివున్నప్పుడు ఆ పొరపాటు అభిప్రాయాన్ని పోగొట్టేందుకు ఎంగిల్సు 1891 లో యిదే విషయాన్ని తిరిగిచెప్పాడు. వారితో ఎంగిల్సు యిలా చెప్పాడు :

"రాజ్యాంగం అనేది 'ఒక వర్గం మరొకవర్గాన్ని అణచివేసే యంత్రం' ఇంతకంటే మరొకటిఎంతమాత్రముకాదు. రాజు పరిపాలన జరిపే రాజరికంలో (మొనార్కీ) యీ రాజ్యాంగ యంత్రం ఎలా వినియోగపడుతుందో ప్రజాతంత్ర రిపబ్లిక్‌లోకూడ అదే విధంగావినియోగపడుతుంది."

— ఎంగెల్సు ("ఫ్రాన్సులో అంతర్యుద్ధం' అనే గ్రంథంలో పీఠికనుండి.)

ఈ సమస్యకు 1917లో - రష్యా విప్లవము జరిగిన తరువాత, ఆ తరువాత సోవియట్ రిపబ్లిక్ అవతరించిన తరువాత మరింత ప్రత్యేక ప్రాముఖ్యత వచ్చింది. సోషలిజానికి ద్రోహం చేసిన విద్రోహులంతా కాట్స్కీ నాయకత్వాన ప్రజాతంత్ర బూర్జువా రిపబ్లిక్ కూడా బూర్జువా వర్గం చేతిలో అణచివేసే ఒక రాజ్యాంగ యంత్రం అన్న విషయాన్ని నిరాకరించారు. శ్రామిక ప్రజానీకం, తాము విముక్తి పొందదలిస్తే ప్రజాతంత్ర బూర్జువా రిపబ్లిక్‌ను కూలద్రోయనవసరం లేదని వాదించారు. వీరి యీ వాదనలకు జవాబు చెప్పడానికే లెనిన్ శ్రామిక వర్గ విప్లవ విజయానికి పూర్వమే రాజ్యాంగ యంత్రము—విప్లవము అనే గ్రంథాన్ని రచించాడు. ఈ గ్రంథములో సంస్కరణవాదులు బూర్జువా వర్గ ప్రతినిధులుగా మారి ఉద్దేశ్య పూర్వకంగా పాతిపెట్టిన రాజ్యాంగ యంత్రంపై మార్క్సు ఎంగిల్సుల అభిప్రాయాలను లెనిన్ తిరిగి త్రవ్వి పైకితీశాడు. ఈ గ్రంథంలో లెనిన్ యిలా చెప్పాడు.

"బూర్జువారాజ్యాలస్వరూపాలు వేరువేరు పద్ధతులలో వున్నాయి. కాని సారాంశములోఅన్నీ ఒక్కటే. ఎలా చూసినా ఆఖరుకు యివన్నీ తప్పనిసరిగా బూర్జువా నియంతృత్వాన్ని కలిగి ఉంటాయి."

— లెనిన్ (రాజ్యాంగయంత్రం-విప్లవం, సెలక్టెడ్ వర్క్సు సంపుటం 7, పుట 34)

ఎంతటి ప్రజాతంత్ర బూర్జువా రిపబ్లిక్ అయినా నియంతృత్వ స్వభావాన్ని గలిగి ఉంటుందనే విషయాన్ని శ్రామిక ప్రజలు స్పష్టంగా తెలుసుకొని వుండాలని లెనిన్ ముఖ్యంగా నొక్కిచెప్పాడు.

ఉదాహరణకు 1919లో లెనిన్ స్వెర్డ్లోవ్ విశ్వవిద్యాలయ విద్యార్థులకు రాజ్యాంగ యంత్రంపై ఉపన్యసించుతూ యిలా చెప్పాడు.

"ప్రత్యేక వ్యక్తిగత ఆస్థి అంటూ వున్నంతకాలమూ, రాజ్యాంగం—అది ప్రజాతంత్ర

రిపబ్లిక్ అయినప్పటికీ—కార్మికులను అణచడానికి పెట్టుబడిదారుల చేతులలో సాధనంగా వినియోగపడే ఒక యంత్రం కాక అదిమరొకటి ఎంతమాత్రమూ కాదు. ఉదాహరణగా యూరప్‌లోని స్విడ్జర్లండ్‌నూ, అమెరికాలోని యునైటెడ్ స్టేట్సునూ పేర్కొనవచ్చు. అవి ప్రజాతంత్ర రిపబ్లిక్ లైనప్పటికీ ఎక్కడా లేనంతదారుణంగా యీ దేశాలలో పెట్టుబడిదారులు పరిపాలన కొనసాగించుతున్నారు."

—లెనిన్ సెలెక్టడ్ వర్క్సు సంపుటి 11 పు 655

అంతేకాక యీ దేశాలలోని కార్మికులు తమ పరిస్థితిని బాగుపరచుకోడానికి ఏమాత్రం గట్టిగా ప్రయత్నించినా వెంటనే సాయుధ బలాలు ఏవిధంగా సమీకరించబడతాయో, అది ఏవిధంగా అంతర్యుద్ధానికి దారితీస్తుందో లెనిన్ వివరంగా విశదీకరించి చూపెట్టాడు.

## పరిణామదశ: వివిధ రూపాలు

ఎంతటి ఉత్తమ ప్రజాతంత్ర బూర్జువా రిపబ్లిక్ అయినా అది శ్రామిక ప్రజలకు వ్యతిరేకమైన నియంతృత్వమని మార్క్సిస్టు లెనినిస్టులకు స్పష్టమే. అయితే ప్రజాతంత్ర రిపబ్లిక్ నాయకత్వం శ్రామిక ప్రజల చేతులలోకి వచ్చేపక్షంలో అప్పుడేమి జరుగుతుంది? శ్రామిక ప్రజల నాయకత్వాన వున్న ప్రజాతంత్ర రిపబ్లిక్ కూడా నియంతృత్వమే అవుతుందా? దానికి ఒకే ఒక సమాధానం ఉంది. అది నిస్సందేహంగా నియంతృత్వమే.

పాతిక సంవత్సరాలక్రిందట కామ్రేడ్ స్టాలిన్ యిలా చెప్పాడు:

"తనవర్గ శత్రువుల ప్రతిఘటనను అణచడానికి రాజ్యాంగం పాలకవర్గాల చేతులలోని ఒక యంత్రం. ఈ సందర్భంలో (యీ పదం యొక్క ప్రాముఖ్యతను తెలియజేయడానికి కామ్రేడ్ స్టాలినే క్రింద గీతకొట్టాడు) శ్రామిక వర్గ నియంతృత్వానికి యితర వర్గాల నియంతృత్వాలకూ అసలు సారాంశంలో భేదం వుండదు. ఎందువల్లనంటే శ్రామిక వర్గ రాజ్యాంగం కూడా బూర్జువా వర్గాన్ని అణచడానికి వినియోగించే ఒక సాధనం. కాని రెండింటికీ ఒక ముఖ్యమైనభేదంవుంది. ఇదివరకల్లా అమల్లో వున్న రాజ్యాంగ యంత్రాలు సమాజంలో అత్యధిక సంఖ్యాకులుగా వున్న పీడిత ప్రజలపై పెత్తనం చెలాయించే అల్ప సంఖ్యాకులైన పీడించే వర్గానికి చెందిన నియంతృత్వాలు.

కాని శ్రామికవర్గ నియంతృత్వం అలాకాకుండా పీడించే మైనారిటీపై పీడించబడే మెజారిటీ ప్రజల నియంతృత్వం. రెండింటిలో వున్న భేదం యిదే.”

చాలారకాలైన బూర్జువా రాజ్యాంగాలు వున్నాయని చెప్పుతూ లెనిన్ ఈ క్రింది విషయంకూడా చెప్పాడు :

“పెట్టుబడిదారీ విధానాన్నుండి కమ్యూనిజానికి చెందే పరివర్తన అనేకరకాల రాజకీయ స్వరూపాలను తప్పకుండా సృష్టిస్తుంది. కాని అసలు సారాంశంలో తప్పని సరిగా ఒకేఒకవిధానముంటుంది. అది శ్రామికవర్గ నియంతృత్వం.”

(క్రింద గీతకొట్టినది రచయిత)

[లెనిన్-రాజ్యాంగ యంత్రమూ, విప్లవం]

ఇప్పుడు సమస్య స్పష్టమైంది : పెట్టుబడిదారీ విధానాన్నుండి సోషలిజానికి పరిణామంచెందే విధానాలు వేరుగా వుండవచ్చు. ఒకటి సోవియట్ విధానం. ఇంకొకటి ప్రజాస్వామిక ప్రజాతంత్ర విధానం. సోవియట్ యూనియన్ అవతరించినప్పుడు యీ సమస్య ఉత్పన్నమైంది. ఆనాడు మెన్షివిక్కులూ, సంస్కరణవాదులైన సోషల్ డెమోక్రట్లూ సోవియట్ రిపబ్లిక్ రాజ్యాంగం, పారిస్ కమ్యూన్ రాజ్యాంగపద్ధతీ అసలు సారాంశంలో ఒకటేననే విషయాన్ని కాదని వాదించారు. పారిస్ కమ్యూన్ అనుసరించిన విధానం, వయోజన ఓటింగుహక్కూ మొదలైనవిగల ప్రజాతంత్ర రిపబ్లిక్ అని వారు వాదించారు. పారిస్ కమ్యూన్ ప్రజాతంత్ర రిపబ్లిక్‌కూ, యీనాటి ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలకు పోలిక ఉన్నదనే విషయం స్పష్టం. రెండింటికీ నియంతృత్వ స్వభావం వుంది. అందుకనే పారిస్ కమ్యూన్ అనుభవాలను ఆధారం చేసుకొని మార్క్సు, ఎంగిల్సులు శ్రామికవర్గ నియంతృత్వంగల రాజ్యాంగ స్వరూపము ఎలావుండాలో తెలియజేశారు. వారు చెప్పినదానినే లెనిన్ స్టాలిన్‌లు సోవియట్ విప్లవంలో అనుసరించి యింకా దాన్ని అభివృద్ధి పరచారు.

హంగేరీ సోవియట్ రిపబ్లిక్ కూడా అది స్థాపించబడినప్పుడు ప్రజాతంత్ర రిపబ్లిక్‌కు వుండే పోలికలున్నాయి. సాయుధ విప్లవం ద్వారా అది స్థాపించబడలేదు. వయోజన ఓటింగు హక్కు మొదలైన వన్నీ అమలులో వుంచబడినాయి. దాని ననుసరించే 1919 మార్చి 25 వ తేదీన లెనిన్ మన దృష్టిని యీ క్రింది యథార్థానికి తెచ్చాడు :

“హంగేరీ విప్లవానికున్న ప్రత్యేక పరిస్థితులలో వారు మన రష్యన్ ఎత్తుగడల నన్నిటినీ వివరంగా అనుకరించడం తప్పు అవుతుందనే విషయంలో ఎలాంటి సందేహమూ లేదు.”

అందువలన ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలు సోవియట్ విధానంలో వున్న శ్రామికవర్గ నియంతృత్వం లేకుండ ఎందుకు సోషలిజాన్ని స్థాపించలేవు?

## సోవియట్ యూనియన్ పాత్ర

ఈ ప్రశ్నకు సమాధానం సోవియట్ యూనియన్ పుట్టుకే. బయట సహాయం లేకుండా కేవలం అంతరంగిక విప్లవశక్తుల ప్రభావం ఫలితంగా సోవియట్ యూనియన్ అవతరించింది. ప్రపంచంలో యీ రకమైన రాజ్యం పుట్టడం యిదే మొదటిసారి. అందువలన రష్యా బూర్జువావర్గం యిది శాశ్వతంగా మనగలుగుతుందని నమ్మలేదు. పైగా సోవియట్ యూనియన్ ఆ విధంగానే జీవించి ఉండటం అసాధ్యమని వారు భావించారు. అందువలన వారు అందులో చేరకుండాబయట వుండిపోయి, ప్రభుత్వంపై తిరుగుబాట్లు లేవదీశారు. తమ రక్తం ఆఖరిబొట్టు అయిపోయేవరకూ తమ శాయశక్తులా ప్రయత్నించారు. బాల్యదశలోవున్న సోవియట్ రిపబ్లిక్ గొంతు నులిమి పోయిన తమ అధికారాన్ని తిరిగి రాబట్టుకొనేందుకు చివరికి విదేశీయుల సహాయాన్ని కూడా వినియోగించారు. అయినా సోవియట్ రిపబ్లిక్ తన్ను తాను రక్షించుకోగలిగింది. చావుబ్రతుకులమధ్య జరిగిన ఈ పోరాట పరిస్థితుల మూలంగానే, సోవియట్ యూనియన్ అతి కఠినమైన చర్యలద్వారా తన్ను తాను రక్షించుకోవలసి వచ్చింది.

ఈ విషయాన్ని గురించే లెనిన్ యిలా వ్రాశాడు:

"పెట్టుబడిదారీ విధానానికీ కమ్యూనిజానికీ మధ్యనున్న కాలం ఒక చరిత్రాత్మకదశ. ఈదశసమాప్తి అయ్యేవరకూ దోపిడీవర్గాలు తిరిగి తాము అధికారానికి రావచ్చునని ఆశతో ఉబలాటపడతారు. ఈ ఆశతోనే వారు తిరిగి అధికారాన్ని గుంజుకోవడానికి ప్రయత్నాలుచేస్తారు. తాము కూలద్రోయబడుట అసంభవమనీ అది ఎన్నడూ జరగనిదని తలంచి అటువంటి ఆలోచనకు కూడా అవకాశమివ్వని బూర్జువావర్గం మొట్టమొదటి సారిగా గట్టిగా దెబ్బతిని పడిపోయిన తరువాత పదిరెట్లు ఎక్కువశక్తితో, వందరెట్లు అధికమైన తీవ్ర ఉద్రేకపూరితమైన ద్వేషంతో తామూ, తమ కుటుంబాలూ హాయిగా అనుభవించిన సుఖజీవితంతో కూడిన 'స్వర్గరాజ్యాన్ని' తిరిగి నెలకొల్పుకోడానికి రణరంగంలోకి దుముకుతారు."

— లెనిన్, సెలెక్టడ్ వర్క్సు సంపుటి 7, పుట 140.

అదే సమయంలో హంగరీ కార్మికులకు అభివందనాలను పంపుతూ లెనిన్ యిలా అన్నాడు:

"అది న్యాయమైన బల ప్రయోగంకాదు, అసలు సరిగా చెప్పాలంటే అది బల ప్రయోగమే కాదు. అది

శ్రామికవర్గ నియంతృత్వం యొక్క సారాంశం."

మాక్జింగోర్కీకి తాను రాసిన లేఖలలో సహితం విప్లవ ప్రతీఘాతకుల విపరీత భయంకర దాడులకు వ్యతిరేకంగా సోవియట్ యూనియన్ తన ఆత్మరక్షణకై హింసా కార్యక్రమాన్ని అనుసరించవలసి వచ్చిందని లెనిన్ సమర్ధించాడు.

## శ్రామికవర్గ నియంతృత్వ విధులు

పెద్దదైన సోవియట్ యూనియన్‌తో పోల్చిచూస్తే మొదటి వాగాలలో హంగరీ సోవియట్ రిపబ్లిక్ కూడా ఎటువంటి బల ప్రయోగం అవసరం లేకుండానే వ్యవహారాన్ని నడపగలిగింది. ఒక్కరినికూడా ఉరితీయవలసిన అవసరం లేకపోయింది. సామ్రాజ్యవాదులు అన్ని ప్రక్కలనుండీ మనపైదాడి చేసినప్పుడే, వారికి సహాయంగా దేశంలోని అభివృద్ధి నిరోధకవర్గాలు ఆయుధాలు చేబట్టినప్పుడే పరిస్థితి అంతా మారింది. 1935 లో హంగరీ అభివృద్ధి నిరోధకుల కోర్టు కమ్యూన్‌చేసిన పనులకు సంజాయిషీ యివ్వమని తన్ను కోరినప్పుడు నన్ను నేను సమర్ధించుకొనే ప్రయత్నం చేయకుండా వివరించి యిలా చెప్పాను: "హింసాకాండ జరపడం మాకు సరదా కలిగించే విషయంకాదు. ఆశయం కూడా ఎంతమాత్రమూ కాదు. కాని యీ విధంగా చేసే అవసరాన్ని శత్రువు మాపై బలవంతముగా రుద్దాడు."

ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలలోవున్న పరిస్థితి పూర్తిగా మరో విధముగా వుంది. సోవియట్ విముక్త సైన్యాలు జర్మన్ ఫాసిజాన్ని తుద ముట్టించడంతోనే ఆగిపోలేదు. ప్రపంచ ప్రాముఖ్యతగల యీవిజయంలో నాజీలు ఆక్రమించుకొన్న సమయంలో వారు స్థాపించిన కీలుబొమ్మ ప్రభుత్వాలూ, రాజ్యాంగ నిర్మాణం - అన్నీ కూలిపోయాయి. హిట్లర్ ఆక్రమితకాలంలో ఈ దేశాలలోని కీలుబొమ్మ ప్రభుత్వాలకు స్వదేశాలలోనే పీడితవర్గాల సహాయం కొద్దో గొప్పో ఉంది. నాజీల ఓటమితో వారుకూడా తోకముడవ వలసివచ్చింది. సోవియట్ యూనియన్‌లోకి హిట్లర్ దుండగింద్రతోపాటు ప్రవేశించి సోవియట్ రిపబ్లిక్‌ను నాశనం చేయడానికి తీవ్రంగా పోరాడిన భూస్వాములూ, పెట్టుబడిదారులూ, నాజీలతొత్తులు, యింకా పెద్ద పెద్ద ఆఫీసర్లూ ఒక్కమాటలో విప్లవ ప్రతీఘాతకులంతా హిట్లర్ సైన్యాల తిరోగమనంతో వారుకూడా పశ్చిమ రాజ్యాలకు పారిపోయారు. ఇంకా మిగిలివున్న అభివృద్ధినిరోధకులు కార్మికవర్గ నాయకత్వాన శ్రామికప్రజలు యీదేశాలలోని అధికారాన్ని హస్తగతం చేసుకోకుండా అడ్డుపడలేకపోయారు. ఈ దేశాలలో సోవియటు సైన్యాలు వుండటం మూలంగా సాయుధ తిరుగుబాట్లు లేవదీయడానికి యింక అవకాశం ఉండదని వారు వూహించారు. కాని 1917, 21 ల్లో సోవియట్ యూనియన్‌లో అభివృద్ధి నిరోధకులు సాయుధ తిరుగుబాట్లు తీసకొనిరావడానికి ప్రయత్నించారు. ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యాలు బలపడుతున్నకొద్దీ బూర్జువావర్గాలు స్వదేశాల

లోని తమ బలాలపై ఆధారపడి తిరుగుబాటుచేసే ఆశలను వదులుకున్నారు.

ఈపరిస్థితులలో తీవ్రమైన అంతర్యుద్ధం అవసరంలేకుండా, శాంతియుతంగానూ, సోవియట్ విధానంగల శ్రామికవర్గ నియంతృత్వం లేకుండా యీ రాజ్యాలు ప్రజాస్వామిక ప్రజాతంత్ర విధానంతో శ్రామికవర్గ విధులను నిర్వహించడానికి అవకాశం లభించింది.

శ్రామికవర్గ నియంతృత్వం నిర్వహించాల్సిన విధులేమిటి ? కామ్రేడ్ స్టాలిన్ చెప్పినట్లు అదిమూడు ప్రధాన కర్తవ్యాలను నిర్వహించాలి.

(అ) విప్లవంలో కూలదోయబడిన భూస్వాముల పెట్టుబడిదారుల ప్రతిఘటనను భగ్నంచేసి, తిరిగి వారు తమ పెట్టుబడిదారీ అధికారాన్ని తెచ్చుకొటకు చేసే ప్రతి ప్రయత్నాన్నీ తుదముట్టించాలి.

(ఇ) కష్టజీవులందరినీ శ్రామికవర్గం చుట్టూ సమీకరించే పంథాలో పునర్నిర్మాణాన్ని ప్రారంభించి చివరకు వర్గాలను, నిర్మూలించి, రద్దు పరచే ఆశయంతో కార్యక్రమాన్ని కొనసాగించాలి.

(ఉ) విప్లవ శక్తులకు ఆయుధాలిచ్చి, విదేశ శత్రువులతోనూ, సామ్రాజ్యవాదులతోనూ, పోరాడటానికి విప్లవ సైన్యాన్ని నిర్మించుకోవాలి.

—స్టాలిన్ ("లెనినిజం పునాదులు" అనే గ్రంథంలో 4వ అధ్యాయం)

ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యాలు ఎంత ఎక్కువగా బలపడితే అంత జయప్రదంగా యీ కర్తవ్యాలను (శ్రామిక వర్గ నియంతృత్వకర్తవ్యాలను) అవి నిర్వహించగలుగుతాయి. అయితే వీటి రెండింటికీ పరస్పర సంబంధం వుంది. గాబట్టి ప్రజాస్వామిక ప్రజాతంత్రరాజ్యాలు ఎంత బాగా యీ విధులను నిర్వహించితే అంత ఎక్కువగా అవి బలపడతాయని చెప్పడం కూడా నిజమే అవుతుంది.

## హంగరీలోవున్న పరిస్థితి

ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలన్నింటిలోకీ హంగరీ కడపటిది. దీనికి ముఖ్యకారణమేమంటే యీ దేశంహిట్లర్ ఆక్రమణలోకి ఆఖరులోవచ్చింది. అంతేకాక హంగరీ విముక్తిపొందిన తరువాత కూడా శత్రువు బలాన్ని మేము తక్కువ అంచనా వేయడం జరిగింది. ఇక్కడ రెండున్నర సంవత్సరాలు కష్టపడి పని చేసినతరువాతనే కమ్యూనిస్టుపార్టీ పారిశ్రామిక కార్మికుల విశ్వాసమేగాక మెజారిటీ రైతుల అభ్యుదయ మేధావుల చిన్నవర్తకుల విశ్వాసాన్ని సంపాదించగలిగింది.

మూడు సంవత్సరాలపాటు శ్రమపడి తీవ్రకృషి చేసిన ఫలితంగా శ్రామిక ప్రజలు మన ఆశయంలోని సత్యాన్ని గుర్తింపజేసిన తరువాతకాని, వెనకటి నుండీ వున్న పెట్టుబడిదారీ వర్గాల కుట్రలను బహిర్గతం చేసిన తరువాతకాని, దేశం ప్రజాస్వామిక ప్రజాతంత్రాన్ని

చేబట్టాలో లేక బూర్జువా ప్రజాతంత్రాన్ని చేబట్టాలో నిర్ణయం జరుగలేదు. మన దేశాన్ని విముక్తిచేసిన సోవియట్ ప్రజల సహాయంమాత్రమే చాలదు. శ్రామిక వర్గనియంతృత్వాన్ని స్థాపించాలంటే పార్శ్రామిక కార్మికుల చేతనే గాక దాని మిత్రులైన పేదరైతులూ చిన్న చిన్న వృత్తి పనివారూ, చిన్నవర్తకులూ, అభ్యుదయ మేధావులూ కమ్యూనిస్టుపార్టీని తమనాయకుడుగాగుర్తించవలసిఉంటుంది. ఈవిషయాన్నే ఆనాడు యిలా చెప్పాం: సోవియట్ మన బానిస సంకెళ్ళను త్రెంచి వేసింది. కాని మనదేశంలో అది ప్రజాతంత్రాన్ని నిర్మించలేదు. అది మనం చేసుకోవలసిన పని.

శ్రామిక ప్రజలలోని మెజారిటీ విశ్వాసాన్ని పార్టీ చూరగొనేవరకూ మన దేశంలో 1917లో కెరిన్స్కీ కాలంలో వలే ఒక విధమైన ద్వంద ప్రభుత్వం ఏర్పడింది. రెండుశక్తులు ఒకదానితో ఒకటి పోటీపడినాయి. పాతశక్తి పెట్టుబడిదారీ విధానంవైపుకు లాగితే కొత్తశక్తి సోషలిజం కోసం పోరాడింది. చివరకు సోషలిజం వైపుకు ప్రజాస్వామిక ప్రజాతంత్రం వైపుకూ జరిగిన పోరాటమే నెగ్గింది. కాని మనంసాధించిన ఫలితాలను సంఘటిత పరచుకోడానికి యింకా చాల సంవత్సరాలు శ్రమపడి కృషిచేయవలసి ఉంటుంది. సోవియట్ యూనియన్ యితర ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలనుండి ఎంతో సహాయాన్ని పొందవలసి ఉంది.

ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలు సోవియట్ యూనియన్ సహాయ సానుభూతులవల్లనే ఏర్పడ్డాయి. పరస్పరంగా సహాయం చేసుకోవడంవలన అవి బలపడ్డాయి. సామ్రాజ్యవాదుల ప్రమాదమున్న యీ సమయంలో అవి సోవియట్ యూనియన్‌పై ఆధారపడుతూ, అవి తమలోతాము పరస్పరం సహాయం చేసుకొంటే అవి మనగలిగి అభివృద్ధి చెందగలుగుతాయి. ఈ సమితినుండి ఏదివిడిపోయినా అది క్రమక్రమంగా ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యంగానూ, సోషలిజం నిర్మాతగాను తన స్వభావాన్ని కోల్పోయి, పెట్టుబడిదారుల, సామ్రాజ్యవాదుల శిబిరంలో తప్పనిసరిగా చేరిపోవలసి వస్తుంది. యుగోస్లోవియా నాయకుల యీ ఆరు నెలల ద్రోహచరిత్రా దీనిని ప్రత్యక్షంగా రుజువు చేస్తున్నది.

## వర్గశక్తుల నూతన సమ్మేళన

హంగరీ కమ్యూనిస్టులమైన మనం ప్రజాస్వామిక ప్రజాతంత్రంయొక్క స్వభావాన్నీ, పాత్రనూ, అభివృద్ధినీ, మొదలుగాగల దాని సమస్యలను పూర్తిగా తెలుసుకొనలేదు. ఈ లోటుకు కొంత కారణం మన దేశంలో ఆలస్యంగా ప్రజాస్వామిక ప్రజాతంత్రంఏర్పడటమే. దానిమూలంగా తప్పనిసరిగా కొన్ని సమస్యలపై పొరపాటు అభిప్రాయాలు ఏర్పడటానికి దారితీసింది. ఈ సమస్యలను తర్కించుతూ కొంతమంది కామ్రేడ్స్ రెండింటికీ (సోవియట్ విధానానికి, ప్రజాస్వామిక ప్రజాతంత్ర విధానానికీ) వున్న ఏక ఆశయాన్ని గట్టిగా చెప్పుతూనే సోవియట్ నియంతృత్వానికి యీ నియంతృత్వానికీ వున్న భేదాలపై ప్రధానంగా నొక్కి చెప్పారు.

చివరకు మరొక ముఖ్యవిషయాన్ని కూడా మనం దృష్టిలోకి తీసుకొనిరావలసి ఉంది. సోవియట్ యూనియన్ విజయఫలితంగానూ, ఫాసిజం ఓటమివలనను

ఏర్పడిన నూతన అంతర్జాతీయ వర్గశక్తుల సమ్మేళన ఫలితంగా ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలు ఏర్పడ్డాయి. కామ్రేడ్ బిరాట్ యీ విషయాన్నే మన దృష్టికి తెస్తాడు:

"ప్రజాస్వామిక ప్రజాతంత్ర విధానం మన యుగంలోని నూతన చారిత్రక పరిస్థితులలో ఎర్పడిన ప్రత్యేక స్వరూపంగల విప్లవఅధికారం. నూతన అంతర్జాతీయ వర్గశక్తుల సమ్మేళన ప్రతిబింబమే యిది"

యుద్ధానంతరం ఏర్పడిన వివిధశక్తుల బలాబలాలు రోజురోజుకూ సోషలిజం వైపుకే మొగ్గాయి. వలసదేశాలప్రజల విముక్తిపోరాటాలు విజయలక్ష్మిని చేబట్టబోతున్న చైనాప్రజలూ, గ్రీక్ కమ్యూనిస్టుల విజయపరంపరలూ, ఇటలీ, ఫ్రెంచి కమ్యూనిస్టుపార్టీల వెనుక దృఢంగా నిలబడుతున్న కార్మికవర్గాలు - అన్నీ దీనినే స్పష్టపరుస్తున్నాయి. సోషలిస్టు ప్రపంచాన్ని నిర్మించే శ్రామికవర్గ అంతర్జాతీయతకు బలాన్నిచ్చే నూతన శక్తులుకూడా యివే. సోషలిస్టు ప్రపంచాన్ని నిర్మించడం ఎంతో కష్టసాధ్యమైనపని. దాన్ని సాధించడం మనతరంప్రజల చారిత్రాత్మక బాధ్యత అయివుంది. దీనివిషయంలో శ్రద్ధ తీసుకొని మనభూమిలో మనహంగరి శ్రామికప్రజల అభ్యున్నతినీ పురోభివృద్ధినీ చేకూర్చేందుకు మనముందున్న కర్తవ్యాన్ని జయప్రదంగానూ, గౌరవయుతంగాను నెరవేర్చుదాం.

[హంగరీ కమ్యూనిస్టుపార్టీ దినపత్రిక జబాద్ నెప్, నుండిఅనువదించబడి "వరల్డు న్యూస్ అండ్ వ్యూస్" అనే ఇంగ్లీషు పత్రికలో ప్రచురించబడింది]

"స్వాతంత్ర్యం సమభావం
సౌభ్రాత్రం సౌహార్దం
పునాదులై ఇళ్ళు లేచి
జనావళి శుభం పూచి
శాంతి శాంతి శాంతి శాంతి
జగమంతా జయిస్తుంది."

— శ్రీ శ్రీ —

# సామ్రాజ్య యుద్ధప్లానులు

[ 'లేబరు మంత్లీ' ఏప్రిల్ సంచికలో కామ్రేడ్ రజనీ పామీదత్తు వ్రాసిన సంపాదక వాఖ్యలలోని కొన్ని భాగాలను యీ క్రింద ప్రచురిస్తున్నాం. — సంపాదకవర్గం]

## జీవితమా లేక మరణమా ?

**రజనీ పామీదత్తు**

ఒకవైపున మార్షల్ యూరప్‌లో ఆయుధ నిర్మాణమూ, నిరుద్యోగమూ విపరీతంగా పెరిగిపోతూవుంటే మరోవైపున ప్రజాతంత్ర తూర్పు యూరప్‌లో పునర్నిర్మాణ కార్యక్రమం జయప్రదంగా సాగిపోతూ ప్రజల జీవన ప్రమాణం దినదినాభివృద్ధి చెందుతున్నది. ఇదే సమయంలో సోవియట్ ప్రభుత్వం తన నూతన బడ్జెట్టును ప్రకటించింది, అందులో సాంఘిక సంస్కృతిక శాంతియుత అర్థికాభివృద్ధికి అవసరమైన వ్యయాన్ని రక్షణ వ్యయానికంటె మూడురెట్లు అధికంగా పెంచింది. దేశరక్షణకు కేటాయించిన వ్యయం, మొత్తం వ్యయంలో అయిదోవంతుకంటే తక్కువగా ఉంది.

యుద్ధశిబిరానికి శాంతి శిబిరానికీ యీనాడున్నంత స్పష్టమైన భేదం యిదివరకెన్నడూ మనం చూసివుంచలేదు. ఈసందర్భంలో ఒక ముఖ్యమైన తేడా మనం చూడవలసి ఉంది. ప్రాశ్చాత్య దేశాలలో ఆటంబాంబుల మారణ ప్రయోగాలను గురించి కొత్తగా తెలియవచ్చిన హంశాలను గురించీ విషవాయువుల యుద్ధపద్ధతులను గురించీ, మిలిటరీ వ్యూహాలను గురించి విపరీతంగా చర్చలు కొనసాగుతూ వుంటే మరోవైపున అదే సమయంలో సోవియట్ యూనియన్‌లో జీవశాస్త్రంలో శాస్త్రజ్ఞులు కనిపెట్టిన నూతన పరిశోధనలను గురించీ ప్రజలందరికీ అన్ని సౌఖ్యాలు అందుబాటులో వుండేందుకు మానవుడు ప్రకృతిని జయించే శాస్త్రీయ సిద్ధాంతాలను గురించి చర్చలు సాగుతున్నాయి. ఈ విధంగా యీ రెండు ప్రపంచా

లలో ఒకటి మానవజాతి మరణానికే రెండోది మానవజాతి భవిష్యత్తు జీవితానికే దారితీస్తున్నాయి కాబట్టి ప్రపంచ ప్రజలు నేడు జీవితాన్నో మరణాన్నో కోరుకోవలసిన సమయ మాసన్నమైంది.

## అట్లాంటిక్, పసిఫిక్

పశ్చిమ యూరప్‌లోనే కాదు యీ విధంగా యుద్ధప్లానులను పన్నేది. మొత్తం జరుగుతున్న యుద్ధప్లానుల పూర్తి స్వరూపాన్ని మనం చూడదలిస్తే ఒక్కసారి ఈ విశాల ప్రపంచం వైపుకు ముఖ్యంగా ఆసియా యుద్ధరంగంలో కొనసాగించబడుతున్న యుద్ధప్రయత్నాలవైపు మన దృష్టిని ప్రసారించవలసి ఉంటుంది. వార్డ్‌ప్రైస్‌కు యిచ్చిన ఇంటర్వ్యూలో జనరల్ మెకార్థర్ యిలా అన్నాడు:

"ఈనాడు పసిఫిక్ మహాసముద్రం ఆంగ్లో - శాక్జన్‌ల (ఇంగ్లీషు భాషను మాట్లాడే జాతులు - అనువాదకుడు) సరస్సుగా మారింది. ఆసియా ఖండాన్ని ఆనుకొనిఉన్న ద్వీపాలన్నింటిలో మన రక్షణ శ్రేణులు నిర్మించబడుతున్నాయి."

— డైలీ మెయిల్, మార్చి 2

పశ్చిమ దేశాల సామ్రాజ్యవాదులు మరుపుగా దురాక్రమణ యుద్ధ సంఘటకు ప్లానులను పన్నడమేగాక బ్రిటన్, ఫ్రాన్సు, హాలెండ్, వారి అమెరికా యజమానులూ యింకా వారితొత్తులు— వీరేమిటి అట్లాంటిక్ ఒడంబడిక పత్రంపై సంతకాలు చేసినవారంతా యీనాడు తూర్పు ఆసియా ప్రజల శాంతి స్వాతంత్ర్యాలకు వ్యతిరేకంగా అతినీచమైన క్రూర వలస యుద్ధాలను కొనసాగించుతున్నారు. ఈ విధమైన దారుణ హత్యాకాండను సాగించుతూ మరోక వైపున యీ రాజకీయవేత్తలు తమ దేశాల ప్రజలముందు శాంతిపై తమకున్న ప్రేమను గురించి ఉపన్యాసాలు దంచుతున్నారు.

## సింగపూర్, న్యూఢిల్లీ, కెనబర్రా

సింగపూర్‌లో బ్రిటిష్ సైన్యాధిపతుల వలసదేశాల గవర్నర్ల, అమెరికా సైన్యాధిపతుల మిలటరీ సమావేశాలు పదేపదే జరుగుతున్నాయి. ఆసియా ఖండంలో ఉధృతంగా పొంగిపొరలుతున్న జాతీయ విముక్తి పోరాటాల వాహినికి అడ్డుపడేందుకు సామ్రాజ్యవాదుల ఉపగ్రహకూటమిని నిర్మించే ఉద్దేశ్యంతో న్యూఢిల్లీలో ఒకదానివెంట ఒకటిగా సామ్రాజ్యవాదుల బంటుల సమావేశాలు జరుగుతున్నాయి. ఈ సమావేశాల వెనుక సమావేశాలు జరుగుతున్నాయి. ఈ సమావేశాల వెనుక నాటకం ఆడించేది ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులే. వీరు ఆసియాలో తమ కీలుబొమ్మగా వ్యవహరించిడానికి నెహ్రూకు ఆసియాలో బెవిన్‌పాత్రను అప్పగించారు. తూర్పు ఆసియాలోని జాతీయ విముక్తి ఉద్యమాల పురోగతికి వ్యతిరేకంగా పశ్చిమసామ్రాజ్యవాదులతో ఏకమయ్యే ఆస్ట్రేలియా, న్యూజీలాండ్ ఇండియా, పాకిస్తాన్, సిలోన్‌లను కలిపి ఒక కూటమిగా నిర్మించేందుకు లార్డు విస్టోవోల్ కెనబర్రా పంపించబడ్డాడు. ఆస్ట్రేలియాకూ, మలయాకూ, సింగ

పూరుకు, కన్సర్వేటివ్ పార్టీ తరఫున ఈడెన్ వెళ్ళాడు. "కమ్యూనిజానికి వ్యతిరేకంగాచేసే యుద్ధానికి" సైనికచర్యలను గురించిపరస్పరంచర్చించుకొనేందుకు అత్యవసర డొమినియన్ ప్రధానుల సమావేశాన్ని ఏర్పాటు చేసేందుకు బ్రిటిషు మంత్రివర్గం నలుగురు ప్రత్యేక రాయబారులను ఏడు డొమినియన్‌లకు పంపించింది. మనం యుద్ధప్రమాదాన్ని ఎదుర్కొనదలిస్తే పశ్చిమ యూరప్ పైనా, సోవియట్ వ్యతిరేక కుట్రలపైన మనం దృష్టిని కేంద్రీకరించితేనే సరిపోదు. యుద్ధరంగాన్ని-అట్లాంటిక్ ఒడంబడిక సంఘటనను సామ్రాజ్యవాదుల సంఘటనగా గుర్తించవలసిన అవసరం ఉంది. సామ్రాజ్యవాదుల యుద్ధపన్నాగాలకు వ్యతిరేకంగా శాంతికోసం పశ్చిమ యూరప్ ప్రజలనూ జాతీయ స్వతంత్రంకోసం పోరాడుతున్న తూర్పు ఆసియా ప్రజలను ఆచరణలో ఐక్యం చేయవలసిన అవసరాన్ని మనం గుర్తించవలసి ఉంది.

## చైనా ప్రపంచాన్ని మార్చుతున్నది

చైనా ప్రజాతంత్ర విప్లవం విజయం పొందడం ప్రపంచ చరిత్రలో ఒక అత్యంత ప్రధాన సంఘటన. పశ్చిమ దేశాలలోని కార్మికోద్యమాలు, ప్రజలు తమ ప్రాంతీయ సమస్యలలో బాగా మునిగిపోయి, చైనా విప్లవ విజయంయొక్క పూర్తి ప్రాముఖ్యతనూ, ప్రపంచ వ్యవహారాలలో అది తీసుకొస్తున్న మహత్తరమార్పును వెనువెంటనే గుర్తించలేకపోయారు. కాని పశ్చిమ సామ్రాజ్యవాద రాజకీయ వేత్తలు యీ సంఘటనకున్న ప్రాముఖ్యతను పూర్తిగా గుర్తించినట్లూ, యిది తమ ఓటమిగా అర్థంచేసుకొన్నట్లు వారు ప్రస్తుతం అనుసరించుతున్న కార్యకలాపాలే స్పష్టపరుస్తున్నాయి. కాబట్టి ఆసియాలోని వలస దేశాలన్నింటిలో జాతీయ విముక్తి ఉద్యమాలు పొందుతున్న విజయ పరంపరలకు అడ్డుకట్ట కట్టడానికి ఎదురుఎత్తుగడలతో సామ్రాజ్యవాదులు నేడు సన్నద్ధమవుతున్నారు అమెరికా సామ్రాజ్యవాదుల అర్థిక, సాయుధబలం గల జంగ్-కై-షేక్ పై చైనా ప్రజాతంత్ర విప్లవశక్తులు బ్రహ్మాండమైన విజయాన్ని సాధించాయి. హిట్లర్ ముసులోని టోజోల పతనాంతరం సామ్రాజ్యవాదం యింతటి ఓటమిని పొంది వుండలేదు. 1917 లో జరిగిన రష్యా విప్లవం తరువాత యిది ప్రజా విముక్తికి మహత్తర విజయం. ఈ విజయంతో మానవజాతిలో అయిదోవంతు సంఖ్య బానిసత్వాన్నుండి బయట పడగలిగింది. యుద్ధం అయిన తరువాత జంగ్-కై-షేక్‌కు ఆయుధసహాయం చేయడానికి అమెరికా ప్రభుత్వం అధికారరీత్యా 200కోట్ల డాలర్లను ఖర్చుపెట్టింది. చైనాను లంచగొండి కొమింటాంగ్ ఆధిపత్యానవుంచి ఆ విశాల భూభాగాన్ని తన వలస ప్రాంతంగా వుంచుకొని విచ్చలవిడిగా దోచుకోడానికి ఇంకొక 800కోట్ల డాలర్లను అనధికారరీత్యా ఖర్చుపెట్టింది, దానికి రక్షణగా జపానులో తన కంట్రోలులోవుండే అభివృద్ధి నిరోధక ప్రభుత్వాన్ని అట్టేపెట్టింది. ఈ ప్లాన్‌లన్నీ యీనాడు భగ్నమయ్యాయి. ప వేల మిలియన్ల డాలర్లు మొత్తం మార్షల్ 'సహాయం'లో ఖర్చుపెట్టిన దానికంటె అధికం-మళ్ళీ తిరిగి రాకుండా గంగలో కలిశాయి. కెన్నత్ రాయల్ట్యు టోకియో పత్రికా ప్రతినిధులతో మాట్లాడుతు

చివరకు జపానును సహితం తమక్రింద వుంచుకోవడం సాధ్యంకాదనే సందేహం అమెరికా మిలిటరీవర్గాలలో ప్రబలుతున్న దని తెలియజేశాడు. తూర్పు ఆసియాలో జపానును తమ దుర్గంగా తయారుచేసు కొంటున్న తమ ప్లానులన్నీ మొత్తము నష్టంగా పరిగణించుకోవలసి వస్తుందని అనుకొంటున్నారు.

## వందకోట్ల ప్రజల భవిష్యత్తు

జాతీయ స్వాతంత్ర్యానికీ, ప్రజా తంత్రానికి జయప్రదంగా పురోగమించేది ఒక్క 45 కోట్ల చైనా ప్రజానీకమే కాదు. తూర్పు ఆసియాలోవున్న వందకోట్ల ప్రజల భవితవ్యం నేడు నిర్ణయించబడబో తున్నది. మంచూరియా, కొరియాలనుండి జావావరకూవున్న ప్రజలూ, ఫిలిప్పైన్సు నుండి ఇండియాలో సరిహద్దురాష్ట్రం వరకూవున్న ప్రజలు, సామ్రాజ్యవాదుల పీడకు స్వస్తిచెప్పి స్వాతంత్ర్యానికి పురోగమించుతున్నారు. ఈ వందకోట్ల ప్రజలు విముక్తిపొందడమంటే పశ్చిమ యూరోపియన్ సామ్రాజ్యవాదుల అధి కారం అంతమవడమన్నమాట. ఇది జరిగితే ప్రపంచమంతటా సామ్రాజ్యవాద భూతా నికి అంతిమ ఘడియలు సమీపించుతాయి.

బ్రిటిష్‌టోరీవర్గాల ప్రధాన పత్రిక ఏమి రాసిందో చూడండి:

"ఉత్తర చైనా నుండి ఇండోనీషియా వరకూ తిరిగి మలయానుండి బర్మా కొండ ప్రాంతాల వరకూ మొత్తం తూర్పు ఆసియా అంతటా వ్యాపించి వున్న విప్లవోద్యమాలు ప్రపంచ రాజకీయ పటాన్నే మార్చివేస్తున్నాయి. దీనితో దాదాపు వందకోట్ల ప్రజల భవిష్యత్తు మరో విధంగా మారిపోతుంది. కమ్యూనిస్టుల నాయకత్వాన లేక కమ్యూనిజం వైపు మొగ్గే నాయకత్వాన వున్న ఈ విప్లవోద్యమాలు పశ్చిమ రాజ్యాలరక్షణకు ఒకసవాలు".

—టైమ్సు సంపాదకీయం
(1949 మార్చి 1)

## సామ్రాజ్యవాదుల మధ్య వైరుధ్యాలు

చైనాలో అమెరికా ప్రాబల్య వ్యాప్తికి అంతరాయం కలగడంమూలంగా యిక డాలర్ సామ్రాజ్యవాదులు ట్రూమన్ ప్రణాళికలోని నాలుగో హంశాన్ననుసరించిఆగ్నేయాసియాలోకీ, ఇండియాలోకి తమ దృష్టిని మరల్చి ఆదేశాలను తమ ఆధిపత్యం క్రిందకు తెచ్చుకోడానికి తమ శక్తిని అధికంగా కేంద్రీకరించుతున్నారు. ఈ ప్రాంతాలు యిప్పటివరకూ పాత సామ్రాజ్య దేశాల (ఇంగ్లండ్, ఫ్రాన్సు, హాలండ్ వగైరా) గుత్తాధికారంక్రింద ఉన్నాయి. అందువలన చైనాప్రజల విజ యాలు ఒకవైపున సామ్రాజ్యవాదుల మధ్య వైరుధ్యాలను తీవ్రపరుస్తున్నాయి. మరోవైపున తూర్పు ఆసియా ప్రజల విముక్తి పోరాటాలకు అత్యంత ఉత్సాహా న్నిస్తున్నాయి. ఈ ప్రాంతాలకోసం సామ్రాజ్యవాదులు తమలోతాము పోటీలు

పడుతున్నారు. వీరివైరుధ్యాలు యీ విధంగా వుండగా అచ్చటిప్రజలు తమ స్వాతంత్ర్యంకోసం యిదివరకెన్నడూ లేనంత దీక్షతో తీవ్రపోరాటాలను సాగించుతున్నారు. ఆగ్నేయాసియాను స్వాహాచేయడానికి అమెరికా సామ్రాజ్యవాదులకు అంత తేలికగా కనపడటం లేదు. ప్రస్తుతం అక్కడ పెత్తనం చెలాయించుతున్న పాత సామ్రాజ్యవాదులు స్వాతంత్ర్యంకోసం వీరోచితంగా పోరాడుతున్న ప్రజల ప్రతిఘటనను తట్టుకోలేక రోజురోజుకూ అపజయాలను పొందుతున్నారు. ఈదేశాలు వారికొక మోయలేని బరువుగా తయారయ్యాయి. ఒక్కమాటలో ప్రజాతంత్ర శక్తులకూ సామ్రాజ్యవాద శక్తులకు మధ్య తూర్పు ఆసియా యీనాడు ఒక యుద్ధరంగంగా తయారైంది. శాంతి, యుద్ధాలను గురించిన మహత్తర సమస్యల భవితవ్యం యిక్కడే నిర్ణయం కాబోతున్నది.

## ఆసియాలో పశ్చిమయూరప్ సామ్రాజ్యవాద పునాదులు

"పశ్చిమ యూరప్‌కు తూర్పు ఆసియా ప్రధాన పునాది" అని బ్రిటిష్ టోరీవర్గాల పత్రిక "టైమ్సు" మార్చి 1 వ తేదీన కంగారుతో సంపాదకీయం రాసింది. అందులో యిలా ఉంది:

"ఆసియా ప్రాంతంలో జరుగుతున్న అల్లర్లు... యీ దేశమూ, ఫ్రాన్సూ, నెదర్‌లాండ్సు, ఆ ప్రాంతాన్నుండి ఎంతో అవసరంగా తెచ్చుకొంటున్న విలువగల ముడిపదార్థాల సరఫరాకు గొప్ప ప్రమాదాన్ని తెచ్చిపెట్టాయి. యుద్ధానికిపూర్వం మలయా ఉత్పత్తి చేస్తున్న 5 లక్షల టన్నుల రబ్బరునుండీ, 60 వేల టన్నుల తగరం నుండీ, బర్మానుండి సరఫరా అయ్యే బియ్యం, లోహాలూ, టేకు నుండి యీ దేశం (బ్రిటన్) తనకు కావలసిన డాలర్లనుసంపాదించుకోగలిగేది... నూనె, రబ్బరు, తగరం, కాఫీలుగల ఇండోనీషియాతో హాలండ్ చేసుకొనే ఒడంబడిక జయాపజయాలపైన అది ఒక శక్తివంతమైన రాజ్యంగా వుండటమో వూడటమో తేలిపోతుంది."

ఇటీవల స్టాఫర్డ్ క్రిప్సు బ్రిటిష్ ఎగుమతులు తమకున్న డాలర్ల కొరతను చాలవరకు తగ్గించాయని గొప్పగా ప్రకటించుకొన్నాడు. కాని యీ సందర్భంలో ఒక విషయాన్ని గుర్తించాలి. బ్రిటన్ మొత్తం ఎగుమతులు సంపాదించిన డాలర్లకంటే 1948 లో మలయా తగరం, రబ్బరూ చాలా ఎక్కువ అమెరికన్ డాలర్లను సంపాదించినాయనే విషయాన్ని గుర్తుపెట్టుకోవాలి. ఈ దేశాలు బానిసత్వాన్నుండివిముక్తిపొందితే యిక సామ్రాజ్యవాదుల దోపిడి సాగదు. అప్పుడు పశ్చిమ

యూరప్ దేశాలు తమస్వదేశంలో ఉత్పత్తిని అభివృద్ధి చేసుకొని తద్వారా తమకు కావలసిన వస్తువులను సరిసమానమైన మారకపు రేటుపై తెచ్చుకోవలసి వస్తుంది.

## కలోనియల్ యుద్ధాల గతి

లేబరు సామ్రాజ్య వాదులు కంటున్న నీచమైన కలలకు చరిత్ర చక్కటి జవాబు చెబుదోంది. క్రూరమైన యీ కలోనియల్ యుద్ధాలు అంతులేని బాధలకూ ధ్వంసానికి కారణమవుతున్నాయి. తమ స్వాతంత్ర్యంకోసం కడుదీక్షతో వీరోచితంగా పోరాడుతున్న ప్రజల ప్రతిఘటన ఫలితంగా యీ యుద్ధాలు ముగింపు దశకు రాలేక పోతున్నాయి. మలయా వంక చూడండి! 1949 ప్రారంభానికే అధికార లెక్కల ప్రకారమే 5705 కమ్యూనిస్టులనూ, గెరిల్లా యోధులనూ జైళ్ళలోనూ కాన్సెంట్రేషన్ క్యాంపులలోను బంధించారు.

ఎన్ని గ్రామాలను బాంబులతో ధ్వంసం చేశారో, ఎన్ని గ్రామాలను క్రూరంగా తగులబెట్టారో, ఎంతమంది స్త్రీలను, పురుషులను, పసిబిడ్డలను అమానుషంగా చంపివేశారో యింతవరకు లెక్కలు తెలియరావడం లేదు.

ఫిబ్రవరి 7 వ తేదీన "టైమ్సు" పత్రిక యిలా రాసింది:

కల్లోల పరిస్థితులు ప్రారంభమైనప్పుడు తిరుగుబాటును ఎనిమిది మాసాలలో అణచలేకపోయినా కనీసం ఆనాటికి తిరుగుబాటును అణచడానికి యింకెంతకాలం పడుతుందో అంచనానైనా వేయగలనని ప్రభుత్వం ఆశించింది. దురదృష్టవశాత్తూ అదేమీ జరుగలేదు. అంతేకాదు. యిప్పటి పరిస్థితులనుబట్టిచూస్తే యీ దండయాత్ర చాలకాలం కొనసాగించవలసి వస్తుందనితోస్తోంది. యీ పోరాటములో యిద్దరి బలాబలాలు, నైతికశక్తీ ఆఖరివరకూ పరీక్షించబడే స్థితికి దిగింది.

జనవరి 28 వ తేదీన జనరల్ బుచర్ యీ క్రింది విధంగా పత్రికా ప్రకటన చేశాడు:

పరిస్థితి చాల తీవ్రంగా వుంది. ప్రస్తుత పరిస్థితులలో యింకెంత మిలిటరీ బలాలను పంపించినా ప్రయోజనము ఉన్నట్లు కనిపించదు. మలయా ప్రజలు మనకు సాయపడితేనే మనకు విజయం కలుగుతుంది. ప్రభుత్వంతో ప్రజలు సహకరించనిదే ఎంత అదనపు మిలిటరీబలం వచ్చినా లాభంలేదు.

## ఇండోనీషియా

ఇండోనీషియాలో డచ్చిసామ్రాజ్య వాదుల దండయాత్ర ఫలితమేమిటి? కరడుగట్టిన సామ్రాజ్యవాద వర్గాల పత్రిక 'టైమ్సు' సాక్ష్యాన్నే తీసుకొందాం.

"పరిస్థితి రోజురోజుకూ దిగజారిపోతున్నట్లు ఇండోనీషియానుండి వస్తున్న రిపోర్టులు స్పష్టంచేస్తున్నాయి. మిలటరీరీత్యా క్రిందటినెలకూ యిప్పటికీ పరిస్థితిలో ఏమాత్రం తేడాకనపడటంలేదు. వారానికి 40 మంది చొప్పున డచ్చివారు తమసైనికులను కోల్పోతున్నారు.

రాజకీయ పరిస్థితి పరిశీలించితే మరీ అధ్వాన్నంగావుంది. ప్రస్తుత పరిస్థితులలో దారితెన్నూ తెలియక బటేవియాలోని డచ్చి ఆఫీసర్లు చాల నిరుత్సాహంతో వున్నారు. ప్రజలలో పేరుప్రఖ్యాతులుగల ఒక్క రిపబ్లికన్ నాయకుడినిగూడా డచ్చివారు తమ వైపుకు త్రిప్పుకోలేకపోయారు. ఈ సందర్భంలో వారి ప్రయత్నాలన్నీ విఫలతచెందాయి."

—టైమ్సు 1949, మార్చి 9

## వియత్నామ్

ఇక వియత్‌నామ్ వైపుకు మన దృష్టిని మరల్చుదాం. ఇక్కడ మొన్ననే ఫ్రెంచి సామ్రాజ్యవాదులు "ప్రజాతంత్ర" ఆశయాలకు నిజమైన ప్రతినిధిగా మాజీచక్రవర్తి బావోదాయికు పట్టం గట్టారు.

1949 జనవరి 8 వ తేదీన 'న్యూయార్క్ నేషన్'లో అమెరికాపత్రికారచయిత ఆండ్రూరాత్ (యితడు అభ్యుదయభావాలకు చెందినవాడు కాదు.-అనువాదకుడు.) వ్రాసిన విషయాన్నే ఉదహరిస్తా.

ప్రస్తుతం మూడురాష్ట్రాలు గల వియత్‌నామ్ భూభాగంలో నూటికి 80 వంతుల భూభాగం వియత్‌నామ్ రిపబ్లిక్ స్వాధీనంలో వుంది. రిపబ్లిక్‌కు 150,000 రెగ్యులర్ సైనికులూ, 30,0000 గెరిల్లా దళ సభ్యులూ వున్నారు. ఫ్రెంచివారి చేతిలో 120,000 సైనికులున్నారు. వారిస్వాధీనంలో పెద్ద పట్టణాలైన సైగాన్, హైఫాంగ్ హానైలున్నాయి....

గత మాసంలో సైగావ్‌లో తమ ప్రభుత్వాన్ని ఎంతమంది వియత్‌నామ్ ప్రజలు బలపరుస్తున్నారని ఫ్రెంచివారు నిలబెట్టిన బావోదాయ్ ప్రభుత్వంలోని ఒక ముఖ్య సభ్యుణ్ణి ప్రశ్నించాను. "బహుశా నూటికి ఒక్కరు బలపరుస్తారేమో; నూటికి 99 మందికి పైగా హోచిమిన్ ప్రభుత్వాన్నే బలపరుస్తారు" అని అతడు స్పష్టంగా జవాబిచ్చాడు. ఫ్రెంచి ప్రభుత్వం యీ దండయాత్రలో అవుతున్న ఆర్థిక వ్యయానికీ, సైనిక నష్టానికీ గిజగిజ తన్నుకొంటున్నట్లు యితర వార్తలు తెలుపుతున్నాయి.

## బర్మా

బర్మాలో థాకిన్‌నూ కీలుబొమ్మ ప్రభుత్వం తనరక్షణకు పూర్తిగా బ్రిటిష్‌ధన సహాయంపైనా, బ్రిటిష్ఆయుధసహాయంపైనా ఆధారపడుతున్నదనే విషయాన్ని యించుకంతమాత్రమూ ఎవరూ దాచలేరు.

రంగూన్‌నగరం మౌల్మీన్, బాస్సీన్ ఓడరేవులూ, యింకా అక్కడక్కడా వేరుపడిపోయి వున్న చిన్నచిన్న ప్రాంతాలను తప్పించి తతిమ్మా దేశమంతా ప్రభుత్వం స్వాధీనంలో లేకుండా తప్పిపోయింది."

—డైలీ టెలిగ్రాఫ్, మార్చి 8, 1949

యీనాడు బర్మాలో సాయుధంగా జోక్యం కలిగించుకోవాలని సామ్రాజ్యవాదులు కంగారుతో డిమాండ్ చేస్తున్నారు దీనినిబట్టే బర్మా ఎలాంటి "స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తుందో మనకు తేటతెల్లమవుతున్నది. 'నూ' ప్రభుత్వ బలహీనతను అవకాశంగా తీసుకొని అభివృద్ధి నిరోధక కెరన్లముఠాలకు రహస్య ఏజెంట్లద్వారా బ్రిటన్ రెచ్చగొట్టింది.

"బర్మా ప్రభుత్వానికి అప్పురూపేణ కొంత సహాయం చేయడం జరిగింది. అందులో కొంతభాగం బ్రిటన్‌లో ఆయుధాలను కొనడానికి వినియోగించబడింది."

—డైలీ టెలిగ్రాఫ్, ఫిబ్రవరి 26, 1946

చిట్టచివరకు బర్మా భవిష్యత్తును గురించి చర్చించేందుకు న్యూఢిల్లీలో సామ్రాజ్య సమావేశం జరగవలసిన దశకొచ్చింది. యిందులో చెప్పుకోదగినదేమంటే యీ సమావేశం బర్మా 'ప్రభుత్వం' ప్రతినిధి హాజరుకాకుండా జరిగిపోయింది.

ఈ సమావేశానికి వెనుకనున్న బండారాన్ని "టైమ్సు" పత్రిక బయటపెట్టింది.

"కొన్ని వారాలక్రిందట బ్రిటిష్ ప్రభుత్వాన్ని కొంతడబ్బును అప్పు పెట్టవలసిందిగా బర్మా ప్రభుత్వం కోరినట్లు తెలుస్తుంది......

బ్రిటిష్ ప్రభుత్వం యీవిషయమై యితర కామన్‌వెల్తు ప్రభుత్వాలను సంప్రతించింది. దీనిఫలితమే ఢిల్లీలో జరిగిన సమావేశం. ఈ సమావేశంలో బర్మా ప్రభుత్వం పాల్గొనకుండావుండే నిర్ణయం జరిగింది... ఈ సమావేశంలో పాల్గొనవలసిందిగా ఇండియా ప్రభుత్వము బ్రిటన్‌నూ, పాకిస్తాన్ను సిలోన్‌ను, ఆస్ట్రేలియాను, న్యూజిలాండును ఆహ్వానించింది."

—టైమ్సు, ఫిబ్రవరి 26, 1949

ఇందులో నున్న రాజకీయ కుతంత్రం స్పష్టంగానే బయటపడుతుంది. బర్మాకు ప్రాతినిధ్యం లేకుండా బర్మాను గురించి చర్చించుకొనేందుకు బ్రిటిషు ప్రభుత్వం ఢిల్లీలో సామ్రాజ్య సమావేశం ఏర్పాటు చేయడానికినిర్ణయించింది. ఇంకనేం! వెంటనే జోహుకుం ఇండియా ప్రభుత్వం ఆహ్వానాలు పంపించింది. ఆ తరువాత సామ్రాజ్య సమావేశ నిర్ణయాలను బర్మా ప్రభుత్వానికి నెహ్రూద్వారా అందజేశారు. ఈసమావేశ నిర్ణయాల యెడా, నెహ్రూ సందేశంపట్లా బర్మాలో 'తీవ్రంగా' అసహ్యించుకొన్నారంటే మనమేమీ ఆశ్చర్య పడవలసిన పనిలేదు.

—(టైమ్సు, మార్చి 5)

"ఢిల్లీలో సమావేశమైన ఆరు రాజ్యాలూ బయటనుండి సహాయం చేద్దామనే ఆశలు - తాత్కాలికంగానైనా విఫలమయ్యాయి. "బ్రిటిష్ సామ్రాజ్యవాదు"లంటే బర్మీయులకు యిప్పటికీ చాల అనుమానాలున్నాయి. తీవ్రజాతీయతను సంఘటిత పరచడం చివరకు ఢిల్లీ సమావేశ ఫలితం.

— డైలీ టెలిగ్రాఫ్, మార్చి 8

**సామ్రాజ్య వాదులు ఆసియాలో తమ ఉపగ్రహాల సామ్రాజ్యకూటమిని నిర్మించడానికి ఆచరణలో చేస్తున్న ప్రయత్నాలు యీ విధంగా మనకు స్పష్టంగా కనపడుతున్నాయి. ఈ కూటమికి**

సామ్రాజ్యవాదమునకూ కీలు బొమ్మగా వుంటున్న ఇండియా కేంద్రంగా స్వతంత్ర చైనాకు వ్యతిరేకంగా వుంటుంది. ఈ కూటమికి కీలుబొమ్మ నాయకత్వ పాత్రను నెహ్రూకు అప్పజెప్పారు.

## ఆసియాలో ఉపగ్రహాల కూటమి నిర్మాణము

ఆగ్నేయాసియాలో సామ్రాజ్యవాదులు తమ ఆధిపత్యాన్ని మిలిటరీ చర్యల ద్వారాకూడా కాపాడుకోలేక పోయారు. జంగ్ కై షేక్ పతనంతో స్వతంత్ర చైనా విజయ పరంపరలతో సామ్రాజ్య వాదులకు గంగవెర్రు లెత్తాయి. ఇక లాభంలేదని ఆసియాలో తమకు ఉపగ్రహాలుగా వుండే దేశాలను, సామ్రాజ్య దేశాలనూ "కమ్యూనిజానికి వ్యతిరేకంగా" ఒక కూటమిని నిర్మించ డానికి పూనుకొన్నారు. కమ్యూనిజానికి వ్యతిరేకంగా పోరాడటం అంటే సామ్రాజ్యాలనూ, సామ్రాజ్యవాద దోపిడీలను అంతమొందించ డానికి కృషిచేస్తున్న జాతీయవిముక్తి ఉద్యమాలకు వ్యతిరేకంగా కుట్రలు పన్నడమన్నమాట. ఈ సామ్రాజ్యవాద కూటమిలో బ్రిటన్ ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, ఇండియా, పాకిస్థాన్, సిలోన్‌లు ప్రాథమిక సభ్యులుగా వుంటాయి. వీటికి ఫ్రాన్సు హాలెండ్, అమెరికాల సహకారం ఉంటుంది. ఈ కూటమిని నిర్మించడానికి మొదటి మెట్టుగా యీ సంవత్సరం జనవరిలో ఢిల్లీలో ఇండోనీషియా పై "ఆసియా" సమావేశం జరిపారు. క్రిందటి సంవత్సరం ఢిల్లీలో జరిగిన ఆసియాదేశాల మహాసభకు మధ్య ఆసియా సోవియట్ రిపబ్లిక్‌ల ప్రతినిధులనూ, వియత్‌నామ్ రిపబ్లిక్ ప్రతినిధులను ఆహ్వానించడం జరిగింది. కాని యీసారి సామ్రాజ్యవాదులకు "నమ్మకంగా" వుండే ప్రభుత్వాల ప్రతినిధులను మాత్రమే అహ్వానించారు.

అమాయకంగా వుండే సామ్రాజ్యవాద వ్యతిరేకులను మోసగించే ఉద్దేశ్యంతో భద్రతాసమితిలో మిత్రరాజ్యసమితి తీర్మానాన్ననుసరించి ఇండోనీషియా సమస్యపై మితవాద తత్వంతో కూడిన ఒక తీర్మానాన్ని చేశారు. యీ సమావేశానికి బి. బి. సి. ఉత్సాహంగా డబ్బా వాయించడం బ్రుసల్సు సంధివలే యీ సమావేశం ఆసియాలో ప్రాంతీయకూటమి నిర్మాణానికి ప్రాతిపదికగా వుంటుందనీ, "ఆసియా జాతుల అధికారవాణి" "ప్రపంచ రాజకీయరంగంలో నూతనశక్తి ప్రవేశ"మనీ (టైమ్సు 24-1-49)లండన్ వర్గాలు పొగడటంవలననే యీ సమావేశానికి వెనుకనున్న వ్యూహం బయట పడిపోయింది. గుర్తుంచుకోవలసిన మరో విషయమేమంటే సరిగ్గా యీ సమావేశం జరుగుతున్న సమయంలో బ్రిటిష్ విదేశాంగ కార్యాలయ ప్రధాన ఆఫీసర్ సర్ విలియమ్ స్ట్రాంగ్ ఢిల్లీలోనే వున్నాడు. ఒకసారి యీ విధంగా ప్రాతిపదిక తయారైన తరువాత యింక రెండోమెట్టు మార్చిలో బర్మాపై సమావేశం జరగడం. ఇక మూడోమెట్టు అంట్లాంటిక్ ఒడంబడికకు నమూనాగా వుండే ఒకకొత్త పసిఫిక్ సంధినో, హిందూమహాసముద్రపు సంధినో ఏర్పాటుచేసేందుకు బ్రిటిష్

మంత్రులు బహిరంగంగానే కెనబర్రాను ఢిల్లీకి పంపబడ్డారు.

## వ్యూహం

సామ్రాజ్యవాదులు పన్నుతున్న వ్యూహాన్ని పెద్దగా దాచేప్రయత్నం కూడా కనబడటంలేదు. మార్చి 14వ తేదీన డైలీ టెలిగ్రాఫ్, పత్రిక యిలా రాసింది:

"ఈ కామన్‌వెల్తు దేశాల నన్నింటినీ పశ్చిమదేశాల రక్షణ శ్రేణిలోకి రాబట్టి ఆసియాలో కమ్యూనిజం వ్యాప్తిని ప్రతిఘటించడానికి ఏదో ఒక విధమైన పద్ధతి ద్వారా సహకరించుకొనే ఏర్పాటును గురించి చర్చించుకోవడమే యీ సమావేశం యొక్క నిజమైన ఆశయాలు. కమ్యూనిజం యొక్క రాజకీయదాడికి ప్రతికూలంగా ప్రధానంగా ప్రస్తుతం ఆర్థికచర్యలపైనే కేంద్రీకరించడం జరుగుతుంది. అయితే యింతమాత్రం చేత మిలిటరీ చర్యల విషయంలో అశ్రద్ధ చేయబడుతుందని తలచరాదు. రష్యాను వ్యతిరేకించే చరిత్రాత్మక బాధ్యతలో అట్లాంటిక్ ఒడంబడికకు అనుబంధంగా వుండే ఏదో విధమైన ఒక హిందూమహాసముద్రపు సంధిని యీ సమావేశం ద్వారా చేసుకోవాలని వూహించబడుతున్నది."

స్థానిక పత్రికలలో యింకా వివరాలు బయటు పడుతున్నాయి. ఉదాహరణకు "స్ట్రెయిట్స్ టైమ్సు" జనవరి 24వ తేదీన యిలా రాసింది.

"ఈ నూతన రక్షణ పథకంలో వైమానిక; నావికా బలాలకు ఆస్ట్రేలియా, న్యూజిలాండులను ప్రధాన కేంద్రాలుగానూ: ఇండియా, పాకిస్తాన్‌లు ప్రధాన కేంద్రాలుగాను వినియోగ పడతాయి. సిలోన్‌లో వున్న ట్రింకోమలె కీలక నావికా కేంద్రముగా వినియోగపడుతుంది. ఆసియాలో కమ్యూనిస్టుశక్తులు వ్యాపించకుండా అడ్డుపడేందుకు యీ రకమైన రక్షణ ఏర్పాట్లను అమెరికా ప్రభుత్వము ఆహ్వానిస్తుంది."

"**పదాతిదళాలను ప్రధానంగా ఇండియా పాకిస్తాన్‌లు సప్లయి చేస్తాయి.**" ఆసియాను సామ్రాజ్యవాదుల బానిసత్వంక్రింద వుంచేందుకు "అహింసా తత్వంగల" ఇండియా సిగ్గుపడవలసిన నేటి ప్రభుత్వ అధ్వార్యాన సైన్యాలను సరఫరా చేస్తున్నదన్నమాట! ఆహా! ఇండియాకు ఎంతటి నీచపాత్ర!!

## భారతీయ నవీన సామ్రాజ్యవాదం

**ఆసియాలోని సామ్రాజ్యవాద విప్లవ ప్రతీఘాతక కేంద్రాన్ని ప్రస్తుతం ఇండియా, పాకిస్తాన్, సిలోన్‌ల లో నిర్మించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.** 1947 ఆగస్టులో వచ్చిన మహత్తర స్వాతంత్ర్య' ఫలితమిదే! ఈ విధంగా యీ దేశాలు పరిణామం చెందడానికి కారణం లేకపోలేదు, ఈ దేశాలలో సామ్రాజ్యవాదులు దీర్ఘ కాలాన్నుండి తిష్ఠవేసివుండటం మూలంగా యిక్కడ జూనియర్ బడాబూర్జువావర్గం తయారయింది. ఈ బడా పెట్టుబడిదారీవర్గాలకూ ఆంగ్లో-అమెరికన్ గుత్తపెట్టుబడిదారులకు సన్నిహితసంబంధాలు ఏర్పడ్డాయి. అందుకనే ఇండియాలో జాతీయోద్యమం తీవ్రరూపం తీసుకొన్నప్పు

డల్లా బడా బూర్జువావర్గం దానికి "అహింస" పేరిట అడ్డుపడుతూ వుండేది. యుద్ధానంతరం వచ్చిన విప్లవం వెల్లువలో భారతీయ పెట్టుబడిదారీవర్గం తన స్థితిని కాపాడుకోనేందుకు జాతీయ స్వాతంత్ర్యాన్ని అమ్మివేసి సామ్రాజ్యవాదులతో రాజీ పడటానికి ఉబలాటపడింది. యీ బడా బూర్జువాకీ ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులు "ఆసియా నాయకత్వం" అనే లంచం పెట్టారు. ఇదే నేటి భారత నవీన సామ్రాజ్యవాదంగా పరిణితి చెందుతున్నది. అందుకనే సామ్రాజ్యవాదులఅడుగుజాడల్లోనడిచేపటేల్ బర్మా. మలయా, ఇండోచైనాలలోని "అల్లరను" "పనికిరాని శక్తులనూ" దృఢసంకల్పంతో అణచివేస్తానంటున్నాడు (గత సంవత్సరం ఆగస్టు స్వాతంత్ర్యదినోత్సవ సందర్భంలో చేసిన రేడియో ప్రసంగం)

## ఆసియాలో మూడోశక్తి బూటకం

సామ్రాజ్యవాద వ్యతిరేక వాతావరణంలోవున్న ఆసియాలో సామ్రాజ్య ఉపగ్రహాల కూటమికి ప్రజాభిప్రాయాన్ని అండగా జేయాలంటే పాశ్చాత్య దేశాలలోవలె "పశ్చిమ నాగరికత" రక్షణ, "క్రైస్తవ నాగరికత" రక్షణ అనే నినాదాలు ఇక్కడ పనిచేయవు. ఇక్కడ ఏదో విధంగా సామ్రాజ్య వ్యతిరేకత" అనే పదాలు పడుతూవుండాలి. అందుకోసం యూరోపియన్ సోషల్ డెమోక్రసీకి సంబంధించిన "మూడోశక్తి" నినాదాన్ని ఇండియాకు ట్రాన్సఫర్ చేశారు. దీని ప్రకారం ఇండియా సామ్రాజ్య వ్యతిరేక ప్రజాతంత్ర శిబిరంలోనూ చేరదు: సామ్రాజ్య వ్యతిరేక కూటమిలోనూ, చేరదు. స్వతంత్రంగా తన మూడోపంథాను అనుసరిస్తుంది. ఇండియా బ్రిటిషు కామన్ వెల్తులోవుండిపోయి ఆంగ్లో - అమెరికన్ సామ్రాజ్యవాదులతో సన్నిహిత సంబంధం పెట్టుకుంటే అది ఆ కూటమిలో చేరిపోయినట్లు ఎంచరాదు. ఇండియా "సర్వస్వతంత్ర రిపబ్లిక్" అది తన ప్రయోజనాల కోసమే "స్వతంత్రంగా" తన మిత్రులను ఏరుకుంటుంది. ఇదీ నేటిఇండియా చెప్పే సిద్ధాంతం. ఈ విధంగా మనం యీనాడు సామ్రాజ్యవాదం ముద్దుబిడ్డ అయిన జవహర్లాల్ గారి ఉన్నతమైన వేదాంత పరిధిలో ప్రవేశించుతున్నాం.

## జంకై - షేక్ - నెహ్రూ

జంగ్ కై-షేక్ అవతారం పరిసమాప్తి చెందింది. ఈనాడు సామ్రాజ్యవాదం నెహ్రూను అతనివారసునిగా తయారు చేయదలచుకొన్నది; ఆసియాలోసామ్రాజ్య ఉపగ్రహ కూటమిని ప్రత్యక్షంగా మార్షల్ నాయకత్వాన గానీ లేక జనరల్ బుచ్చర్ నాయకత్వాన గాని నిర్మించడం సాధ్యంకాదు. ఇందుకోసం వారికి నెహ్రూ తప్పనిసరిగా అవసరం. ఈ పాత్రకు నెహ్రూ కూడా సరిగ్గా సరిపోతాడు. చక్కని పదాలు గుప్పించగలడు. అటు అతివాదివలే సామ్రాజ్యవాద 'వ్యతిరేకవలే పెద్దపెద్ద'ప్రసంగాలు చేయగలడు. ఇందుకు సరిపడ పాతచరిత్రకూడా అతనికుంది. అటు లండన్‌లో డొమినియన్ ప్రధానుల సమావేశానికి వెళ్ళి ఇండియాను బ్రిటిష్ సామ్రాజ్యానికి అమ్మి కమ్యూనిజానికి వ్యతిరే[illegible]ంగా యుద్ధ సన్నాహాలు చేయగల[illegible]. ఇటు మానవత్వాన్ని గురించీ పౌరహక్కులను గురించి అందరూ మెచ్చేటట్లు ఉపన్యాసాలు

దంచగలడు. ఇటు వెయ్యిమంది రైల్వే కార్మిక నాయకులను బంధించి రైల్వే సమ్మెను క్రూరంగా అణచగలడు. 6500 కమ్యూనిస్టు నాయకులను బందిఖానాలో పడవేశానని చెప్పుకోగలడు.

మే 3వ తేదీన లండన్ బడాపెట్టుబడిదారీ వర్గాల పత్రిక "ఎకానమిస్టు" ఏమి వ్రాసిందో ఒకసారి తిలకించండి! సామ్రాజ్యవాదులు అతణ్ణి ఏలా ప్రేమిస్తున్నారో చూడండి!!.

"కామన్‌వెల్తు కాన్ఫరెన్సు జరపడమనేభావం ఎంతో సమంజసంగానూ, నవీనంగానూ వుంది. ఇది నెహ్రూ ధైర్యసాహసాలుగల రాజ్యాంగవేత్త అనీ, స్వయంగా గొప్ప భావాలు గల నిర్మాణాత్మక మేధావి అని రుజువు చేస్తున్నది. ఇండోనీషియా సమస్యను చర్చించేందుకని ఆసియా జాతులను సమావేశపరిచి, రష్యాను చెందిన సామ్రాజ్యవాద వ్యతిరేక పాత్రను ఆసియాలో తాను తీసుకొని ఆసియా ప్రజాభిప్రాయానికి నాయకత్వం వహించగలిగాడు. కామన్‌వెల్తు రాజ్యాలను ఒక కుటుంబంగా అతడు ఒకచోట చేర్చగలిగాడు. దీనివలన బర్మా అంతరంగిక విషయాలలో జోక్యం కలిగించుకుంటున్నదనే నింద బ్రిటన్‌కు లేకుండా చేశాడు. మరోవైపున ఇండియా తూర్పు సరిహద్దులలో వున్న అసంతృప్తి కరమైన పరిస్థితులను ఎదుర్కోవడానికి ఇండియా ఏకాకి గాకుండా కూడా చేయగలిగాడు."

మార్చి 9వ తేదీన "టైమ్సు" పత్రిక యిలా రాసింది:

"బర్మా, చైనాలు అనుభవించుతున్న అల్లర్లనుండి ఇండియాను రక్షించాలనే దృఢనిశ్చయంతో నెహ్రూ ఆగ్నేయాసియాదేశాలలోని యితర దేశాలకు మార్గాన్ని చూపెడుతున్నాడు."

నెహ్రూ జంగ్‌కైషేక్ పంథాను చేబట్టాడు ఆ పంథా ఎక్కడ అంతమవుతుందో అతనికి తెలుసు.

15-3-59



# చైనా లెనిన్ : : కామ్రేడ్ మావో-సే-టుంగ్

[ ఇప్పటివరకూ చైనా కమ్యూనిస్టు నాయకుని పేరు మా. సి. యాంగ్ అని వ్రాస్తున్నాం, ఆయన పేరు "మావో-సె-టుంగ్"గా వ్యవహరించడం సరియైనదని మాకు తెలియవచ్చింది. ఈ మార్పును పాఠకులు గమనించకోరుతాం. —సంపాదకవర్గం—జనత]

పేదల్లో పేదగా రైతుల్లో రైతుగా ప్రజలలో సంచరిస్తూ తాను వారినుండి ఎన్నో నేర్చుకుంటూ వారికి నేర్పుతూ ఉంటాడు కామ్రేడ్ మావో. ఆయన యిచ్చే ముఖ్య నినాదంకూడా అదే. "ప్రజలనుంచి, ప్రజలవదకు"

---

కామ్రేడ్ మావో గొప్ప మేధావి. ఆర్థిక, రాజకీయాల్లో అందెవేసినచేయి, ప్రపంచ పరిస్థితిని ఎప్పుడూ చక్కగా గమనిస్తూ ఉంటాడు. ఒక్కక్షణంకూడా వృధాచెయ్యడు. నిగర్వి - శాంతమూర్తి. గొప్పవక్త. పండితుడు. పీడిత ప్రజా విముక్తికై నిలబడ్డాడు. ఈయనను సజీవంగాగానీ, చంపిగానీ తెచ్చియిచ్చిన వారికి 3,750000 డాలర్లు బహుమానం ప్రకటించాడు జంగ్-కై షేక్. 1927 లో నేటి ప్రపంచ రాజకీయాల్లో కామ్రేడ్ మావో ఒక ప్రధాన వ్యక్తిగా ఉన్నాడు. సామ్రాజ్యవాదుల గుండెల్లో బల్లెం. ఆసియాఖండానికి ఆశాజ్యోతి. సేనాధిపతి. రాజకీయవేత్త. 50 కోట్ల చీనాప్రజల విముక్తికై పోరాడి నూతనచైనాను నిర్మిస్తున్న ధీరుడు. విప్లవయోధుడు. 20 సంవత్సరాలు యితరప్రపంచంతో సంబంధం లేకపోయినా ప్రపంచపరిస్థితిని మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించి చైనాపరిస్థితులకు సరిగా మార్క్సిజాన్ని అన్వయింపజేసి జయప్రదంగా ఉద్యమాన్ని నడుపుతున్న ప్రముఖ మార్క్సిస్టు నాయకుడు. ప్రజలకు అర్థమయ్యే భాషలో ఉపన్యాసాలిస్తాడు. సామెతలతో చక్కని ఉదాహరణలతో సామాన్య ప్రజానీకానికి బోధించుతాడు.

ఈయన 1893 సంవత్సరంలో హూనాన్ రాష్ట్రంలోని హోషాన్ అనే కుగ్రామంలో జన్మించాడు. బీదతనంవల్ల ఈయన తండ్రి సైన్యంలో చేరాడు. కొద్ది భూమిని సంపాదించాడు. క్రమంగా కమీషను వ్యాపారంలో డబ్బుగడించాడు. ధనిక రైతుగా పరిగణించబడ్డాడు. మావో

తన ఆరవఏటనుండీ తల్లితో కలిసి పొలంలో పనిచేసేవాడు. 8వ ఏటనుండి 13వ ఏడువరకూ ప్రాథమిక పాఠశాలలో చదివాడు. సూర్యోదయానికి పూర్వం, సూర్యాస్తమయం తరవాత కూడా పొలంలో పనిచేసేవాడు. పగలునీతిశాస్త్ర గ్రంథాలు వల్లె వేసేవాడు. ఆయన మాష్టరు పిల్లలను బాగాకొట్టేవాడు. మాష్టరు దెబ్బలు పడలేక పదిసంవత్సరాల వయస్సులో మావ్ ఝింటినుండి పారి పోయాడు. కాని తర్వాత తిరిగి తండ్రి తీసుకొనివచ్చాడు.

తండ్రి డబ్బులు యిచ్చేవాడుకాదు. మంచి ఆహారంఉండేదికాదు. తల్లి పీనాసి. మావో అతనితమ్ముడూ పాలేరు ఒకపక్షం. తండ్రిపై తిరుగుబాటు చేసేవాడు. తండ్రి వడ్డీ వ్యాపారంచేసి అక్రమంగా డబ్బు పోగుచేసేవాడు. ఒక విందు సమయంలో మావోను అందరిఎదుటా అవమానించాడు. ఎందులోనైనా పడిచచ్చిపోతాననివెళ్లాడు మావో. మళ్ళీ తండ్రి తిరిగి తీసుకొని వచ్చాడు. ఈ విధంగా అసభ్యంగా ఎన్నడూ మాట్లాడనని తండ్రి దగ్గర వాగ్దానం తీసుకొని మరీవెళ్ళాడు ఇంటికి.

తల్లికి చదువురాదు. తండ్రికి కొద్ది పాటిమాత్రం వచ్చును. ఇంట్లో బాగా చదువుకున్నవాడు అవుటవల్ల గౌరవించ బడేవాడు. తండ్రి మతగ్రంథాలు చదువ మనేవాడు. మావోకు వాటిపై యిష్టం లేదు. 13 వ ఏట స్కూలు వదలాడు. పాలేరుతో సమంగా కష్టపడి తీరిక సమయాల్లో చరిత్రలు వీరుల జీవితాలూ మంచిమంచి నాటకాలూ నవలలు చదివే వాడు.

చీనాప్రజలమీద మంచి పుస్తకా లే లేవే అనుకొనేవాడు. ఇంకా చదువుకుందామని ఆశతో పారిపోయి ఒక లాయరు వద్ద ఒక పండితుని వద్ద న్యాయశాస్త్రం, ఆ నాటికి వచ్చిన మంచి వ్యాసాలనూ 1½ సం॥ రాల పాటు అభ్య సించాడు.

చాంగ్షాలో క్షామం వచ్చిన వర్తకు లందరూ తనపాఠశాలముందుగా పోతుంటే వారిని ఎన్నో ప్రశ్నలు వేశాడు. వారంతా గవర్నరు వద్దకు రాయబారం వెళ్ళారు. వారిలో చాలామందిని చంపి ప్రేలాడ దీశారు, దీనితో మావోలో క్రోధం ప్రజ్వ రిల్ల సాగింది. మావో స్వంతజిల్లాలో క్షామం వచ్చింది; "ధర యివ్వకుండా ధాన్యం తీసుకోండి" అనే నినాదంతో ప్రజలున్నారు. మావోకు వారియెడల సానుభూతి, తండ్రికి కోపం.

బౌద్ధమతాన్ని వ్యతిరేకించి నిరీశ్వర వాదాన్ని ప్రబోధించే ఒక గురువును గౌరవించేవాడు. చైనాను సామ్రాజ్య వాదులు చీల్చి పాలించుతున్నారన్న కర పత్రం చదివాడు. దాంతో అతనిలో, ప్రతీకారేచ్ఛ బయలుదేరింది. తండ్రి ధాన్యం వ్యాపారంలో ప్రవేశపెట్టాలని చూచాడు. లాభంలేకపోయింది. ఆధునిక శాస్త్రాలు చెప్పే పాఠశాలలో చేరాడు. పురాణాలు వగైరా అన్నీ చదివాడు. వీరుల చరిత్రలు చదివాడు. గ్రాంథిక భాషలో మంచి వ్యాసాలు వ్రాసేవాడు.

చాంగ్షా రాజధానీ నగరంలోని స్కూలులో చేరాడు మొట్టమొదట సారిగా ఒక రాజకీయ వ్యాసం వ్రాసి స్కూలు గోడకు అతికించాడు. నవయువకుడైన మావో హృదయంలో విప్లవబీజాలు మొలకలెత్త సాగాయి. మావో చదువుతున్న కళాశాలలో ఒక నాయకుడు నిర్మించిన విప్లవ సైన్యంలో

చేరాడు. క్రమశిక్షణ లేకపోవడంవల్ల ఏడు డాలర్ల జీతంమీద రాష్ట్ర సైనిక దళంలోకూడా చేరాడు. ఆ డబ్బుతో పత్రికలు కొనేవాడు.

మంచూ ప్రభుత్వ పతనంతో చైనా ఐక్యమైందని తెలుసుకొని రాజీనామా యిచ్చి సబ్బులు చేయుట నేర్చుకునే ఫ్యాక్టరీలో చేరాడు. న్యాయశాస్త్రం, వాణిజ్యం, నేర్చుకోవాలనుకొని చదువు విరమించాడు. హునాన్ రాష్ట్ర గ్రంథాలయంలో అనుమాసాలుండి ప్రపంచ భూగోళం, చరిత్ర అర్థశాస్త్రం, డార్విన్ పరిణామవాదం. రూసోరచనలు మొదలగునవి ఎన్నో చదివాడు. హునాన్ కళాశాలలో చేరి 5 సంవత్సరాలలో పట్టభద్రుడయ్యాడు. విప్లవ పత్రిక అయిన 'ప్రజాశక్తి'ని చదివేవాడు. పట్టభద్రుడైన తరువాత ఉదయమేలేచి గ్రామాలవెంట తిరిగిరైతులతో పరిచయంపెట్టుకొనేవాడు.

ఈయన ఒక విద్యార్థుల సంఘాన్ని ఏర్వాటుచేశాడు. చైనాను గురించి అంతర్జాతీయ రాజకీయాలను గురించి నేర్చుకుంటూ శిక్షణగలిగి పనిచేసేవాడు.

1918 లో "పనిచేస్తూ చదువుకుందాం" అనే నినాదంతో విద్యార్థులను ప్రోత్సహించాడు, ఫ్రాన్సు వెళ్ళుటకు ఫ్రెంచి భాషను నేర్చుకోవడం మొదలుపెట్టాడు. చాలామంది విద్యార్థులు వెళ్లారుగాని మావో చైనాలోనేఉండి చైనానుగురించి ఇంకా తెలుసుకోవాలనుకున్నాడు. పీపింగు విశ్వవిద్యాలయంలో గ్రంథాలయ సహాయ ఉద్యోగిగా పనిచేశాడు. అచ్చటికి వచ్చే అతివాదులతో మాట్లాడాలనుకునేవాడు. కాని ఈ చిన్న ఉద్యోగితో మాట్లాడేదెవరు? అయినా నిరుత్సాహం చెందక వారందరితోను "తత్వశాస్త్రం సమాజం" పత్రికారచయితల సంఘాల్లోను చేరి చర్చించేవాడు. అతివాద రాజకీయాల్లో ప్రవేశించాడు. చాంగ్షా రాజకీయాలతో ప్రత్యక్షసంబంధం పెట్టుకుని సియాం చియాంగు అనే పత్రికా సంపాదకుడుగా ఉన్నాడు."

నూతన ప్రజాప్రబోధక సంఘంతరఫున మావో తీవ్రప్రచారం చేశాడు. పెంకింగులో ఆనాటి ప్రచారంవల్ల ఆ గవర్నరును వెళ్ళగొట్టగలిగారు. కాని ఆ సంఘంలో అతివాద మితవాద పక్షాలేర్పడ్డాయి. అతివాదుల పక్షాన మావో హునాన్‌రాష్ట్ర పునర్ నిర్మాణ సంఘాన్ని నెలకొల్పి ప్రచారంచేశాడు. స్త్రీ పురుషులకు సమాన హక్కులు ఉండాలని, ప్రజాప్రభుత్వం ఉండాలని ప్రచారం చేశాడు.

1920 లో మార్క్సిజాన్ని అర్థం చేసుకుంటూ హునాన్‌లో ప్రథమ కార్మిక సంఘాన్ని ఏర్పాటుచేశాడు. 1921లో ప్రథమ కమ్యూనిస్టు పార్టీ మహాసభ షాంగైలో జరిగింది. మావో అందులో పాల్గొన్నాడు, అక్టోబరులో హునాన్ పార్టీ మావోచే నిర్మించబడింది 1927 లో కార్యదర్శి అయిన మావోచే ఆరాష్ట్రంలో రైల్వే; మునిసిపల్ అచ్చు టంకశాల పనివారల సంఘాలు స్థాపించబడ్డాయి.

1923 లో కుమింగుటాంగుతో ఐక్య సంఘటన కాలంలో పార్టీ కేంద్రకమిటీ సభ్యుడుగా అందులో పాల్గొని పనిచేశాడు. 1924 లో షాంగైలో జరిగిన కుమింటాంగు సభలో కార్యనిర్వాహక సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. 1925 లో హునాన్ రైతుల్లో సంచలనం కలిగింది. మావో ప్రచారం చేసి రైతు సంఘాలను ఏర్పరిచాడు. భూస్వాములు మావోను

అరెస్టు చేయాలని గోలపెట్టారు. మావో కాంటన్ నగరం వెళ్లాడు. అచ్చట కుమింగుటాంగు రాజకీయ పత్రిక సంపాదకుడుగా పనిచేశాడు. అందులో అతివాద రాజకీయ ప్రచారం సాగించేవాడు. రాష్ట్రాలనుండి వచ్చిన విద్యార్థులకు రైతు కార్మిక సమస్యలు చెప్పేపాఠశాలకు నిర్మాణాధికారిగా పనిచేశాడు. కుమింగుటాంగు ప్రచారశాఖ అధికారిగాను పార్టీ కేంద్ర కమిటీ సభ్యుడుగాను మావో ప్రఖ్యాతి పొందాడు.

హూనాన్ రైతుల్లో చేసిన పనివల్ల కలిగిన అనుభవంతో "చైనా సమాజంలో వివిధవర్గాలు" "వర్గ ప్రనాదులు, మనం నిర్వర్తించవలసిన పనులు" అనే కరపత్రాలు వ్రాశాడు. 1926 లో షాంఘైకు వెళ్లి హునాన్ రాష్ట్రం రైతుల్లో పని చేశాడు.

1927 లో హోపె, కియాంగ్సీ, పురాని హునాన్‌లలోని రైతులు విప్లవ భావాలతో ముందుకు వస్తుంటే వారిలో కలిగిన విప్లవ చైతన్యాన్ని ముందుకు తీసుకొని వెళ్ళవలసినది పోయి, ఆనాటి కమ్యూనిస్టు నాయకుడుగా ఉన్న చెన్‌టున్యూ ఈ విప్లవాని కంతకూ మావోయే కారణమని అతనిని వెనుకకు రప్పించాడు.

1927 లో నాన్‌కింగు, షాంగేలలో కార్మికులను జంగుకైషేక్ క్రూరంగా హింసించ మొదలుపెట్టాడు. రక్తాన్ని ప్రవహింపజేశాడు. కమ్యూనిస్టుపార్టీపై తిరగబడ్డాడు. బెన్‌సెన్‌సల్యా కమ్యూనిస్టు నాయకులను ఇతరదేశాలు వెళ్లమన్నాడు. మావో మాత్రం హునాన్ రాష్ట్రం వెళ్ళి పని చేస్తానని వెళ్లాడు. వెళ్లిన పదిరోజులలోనే అచ్చట తిరుగుబాటు తీసుకొని వస్తున్నాడని చెనీటన్యూ మావోను వెనుకకు పంపించాడు. పార్టీలో చెనీ నాయకత్వం యడల విసుగుజెంది పార్టీనుండి చెనీని వెళ్ళగొట్టారు.

1927 లోనే మావో భార్య కూలీ స్త్రీ సంఘాల్లో పనిచేస్తోందని ఆమెనూ, మావో సోదరినీ జంగ్ ఉరిదీయించాడు. మావోఅంటే జంగుకు సింహస్వప్నం; పార్టీని మావో అభివృద్ధి పరచాడు. 6 వేలమైళ్ళ యాత్ర సాగించాడు. ఉత్తర చీనాలో సోవియటును స్థాపించాడు. 20 సంవత్సరాలు యితర ప్రపంచంతో సంబంధం లేకపోయినా మార్క్స్ లెనిన్ సిద్ధాంతాలను తప్పకుండా అమలులో పెట్టాడు. ఈయనకు కుడిభుజం కామ్రేడ్ చూటే.

కామ్రేడ్ మావో జంగ్‌కైషేకును చంపగలిగేవాడే. ఆనాడు ఫాసిస్టు వ్యతిరేక పోరాటం సాగుతుంటే సేనాధిపతే జంగ్‌ను అరెస్టు చేసినపుడు మావో వదలించాడు. "దొంగల గుంపుల నాయకుడుగా ప్రచారం చేయబడ్డ మావో మూడువేల సైనికులతో ప్రారంభించిన ఉద్యమం బ్రహ్మాండంగా సాగి 25లక్షల సైనికులతో బలోపేతంగా అమెరికన్ సామ్రాజ్యవాదులచే జంగుకు యివ్వబడిన నూతన మారణ ఆయుధాలు చేబట్టి అభివృద్ధి నిరోధకులను ఎదిరించింది.

దీర్ఘయాత్ర మావోను నాయకత్వం లోకి తెచ్చింది. ఆయన నాయకత్వం లేకుండా దీర్ఘయాత్ర విజయవంతంగా సాగేది కాదని కమ్యూనిస్టులు తలుస్తారు. మావో 1927 నుండీ నాయకుడుగా భావింపబడుతున్నా 945 సంవత్స

రంలో 7 వ కాంగ్రెసులో పార్టీ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డాడు. ఈయన ఎన్నో కరపత్రాలు, పుస్తకాలు వ్రాశాడు. 1940 లో 'చైనానూతన ప్రజాస్వామికం' అనేపుస్తకం వ్రాశాడు. దాని ప్రాతిపదికపై తూర్పుయూరపు దేశాల్లో ప్రజాస్వామిక ప్రజాతంత్ర రాజ్యాలు నిర్మించబడ్డాయి. ఈ పుస్తకం ఇంగ్లీషులోను రష్యనుభాషలోను ప్రకటించారు. (తెలుగులో ప్రజాశక్తి ప్రచురణాలయంవారు ప్రకటించారు. ఖరీదు 1-0-0)

మావో చక్కని అంచనావేయగలడు. ఆయన వేసిన అంచనా ఏదీ నిరుపయోగం కాలేదు.

1947 లో ఈలా అన్నాడు "రాబోయే 3 లేక 5 సంవత్సరాలలో చీనాదేశమూ ప్రపంచపరిసితులూ అన్నీమారిపోతున్నాయి. మన పార్టీ సభ్యులందరూ చీనా ప్రజలందరూ నూతన చీనాకొరకు నూతన ప్రపంచం కొరకు గట్టిగా పోరాడాలి!!."

శత్రువును గురించి ఈ విధంగా అన్నాడు:

"శత్రువు మామీదికి వచ్చినపుడు మాకంటే బలంగా ఉంటాడు. మంచి ఆయుధాలు కావలసినంత మందుగుండూ; విదేశీయుల అండ వారికి ఉంటాయి. అప్పుడు వారితో పోరాడి మేము దెబ్బతిన్నామా మేము నాశనమయ్యామన్నమాటే. పోరాడివైరులను వెనుకకు తరిమి వేయగలిగామనుకొండి! అది కూడా విజయం కాదు. అప్పుడు మా మందుగుండు అంతా అయిపోతుంది. కాని విరోధులు కావలసినంత మందుగుండు తేలికగా సంపాదించుకుంటారు. తిరిగి దాడి చేస్తారు. అందువల్ల అది కూడా మాకు విజయంకాదు. వైరులను చుట్టుముట్టి నాశనం చేసి తుపాకులు, తుపాకిగుళ్లు మనుష్యులతో సహా వశపరుచుకుంటేనే మాకు విజయం"

(మా-సీ-యాంగు ఉపదేశాలు)

మావు ఏదిచెప్పినా ఖచ్చితంగా తేలిక భాషలో చెబుతాడు. ఆయన మార్క్సిస్టు అధ్యయన కారులనుగురించి ఇలాచెప్పాడు:

"మార్క్సిజం లెనినిజం చూడ్డానికి అందంగానూ ఉండదు, గారిడీకూడా కాదు. అది బాగా ఉపయోగ కరమైనది మాత్రమే. "సర్వరోగనివారిణి" మాత్రగా దీనిని ఎంచేవారు కొందరున్నారు. దీనిని పాండిత్యంగా చూచేవారందరూ ఇలాంటివారే. వీరిపాండిత్యం అంతా ఆవుపేడకంటే తీసికట్టు అని మనం వారికి చెప్పాలి. పే[illegible] ఎరువుగానైనా ఉపయోగ ప[illegible] తుంది. వీరి పాండిత్యం అందుకు[illegible] పనికిరాదు.సిద్ధాంతాలను మాత్ర[illegible]

పట్టుకొని ప్రేలాడే పండితులను నిద్ర లేపడం కోసమే నేను యింత కటువుగా మాట్లాడుతున్నా...

(మా-సీ-యాంగు ఉపదేశాలు)

పట్టభద్రులను గురించి ఏమిఅన్నాడో చూడండి.

సమాజ జీవితానికి ఏ మీా సంబధం లేకుండా కాలేజీల్లో పట్టభద్రులై వస్తున్న విద్యార్థుల సంగతేమిటి ? బాగా తెలిసిన వాళ్లుగా పరిగణించబడుతున్నారు. మొదటి విషయం : వీరికి భూమి దున్నడం ఎమీా తెలియదు. రెండు: ఫ్యాక్టరీలో ఏలాపనిచేయాలో తెలియదు. మూడు : యుద్ధరంగంలో పోరాడడం తెలియదు. నాలుగు : ఆఫీసుపని తెలియదు. అతనికి తెలిసిందల్లా పుస్తకాల్లో ఏముందో మాత్రమే. ఈలాంటి వారిని సర్వజ్ఞులని ఏలా అంటారు? కానే కాదు. మహాఅయితే వీరు అర్థ విజ్ఞానులు మాత్రమే.

— (మాసీయంగ్ ఉపదేశాలు)

మావో యింకా ఏమంటాడో చూడండి.

రోజూ స్నానంచేయాలి. లేకపోతే మురికికంపు వేస్తావు. రోజూ దిని తుడవాలి. లేకపోతే గది అంతా దుమ్ముమయమైపోతుంది. మన పార్టీ సభ్యులపని, వారి సిద్ధాంత జ్ఞానాన్ని గురించికూడా అంతే. అంటేనిరంతరందానినిశుభ్రపరుస్తూ ఉండాలి. నిలవనీరులోనే మురికి కంపువస్తుంది. ప్రవాహంలో మురికికంపురాదు. అనగా నిరంతర చలనంవల్ల, దుష్ట క్రిములు నశించిపోతాయి.

మావు అంచనాలు ఎంత ఖచ్చితంగా ఉంటాయో, అయన విమర్శకూడా అంతే ఖచ్చితంగా ఉంటుంది. ఆయననుండి మనం నేర్చుకోవలసినవి ఎన్నో ఉన్నాయి.

"యుద్ధానంతరం ప్రపంచం అంతటా 1946 సంవత్సరం పొడుగునా అభివృద్ధి నిరోధకులప్రైన, అభివృద్ధిని కోరేవారు జయప్రదంగా దాడిచేశారు. చీనాలోకూడా అంతే. శాంతికోరకు యావత్తు ప్రపంచంలోను. చీనాలోనూ ప్రజాశక్తులు ఎంతో బలపడ్డాయి. ఈ శక్తులు విజయం సాధించి తీరుతాయి. ప్రపంచంలో ఏశక్తి వీరిని ఆపలేదు.

"చీనాలోనూ యావత్తు ప్రపంచంలోను అమెరికా దురాక్రమణ విధానానికి వ్యతిరేకంగా ప్రజలందరి సంయుక్త సంఘటన 1947 లో ఏర్పడుతుంది. త్వరిత గతిని అభివృద్ధి పొందుతుంది. ప్రజాస్వామ్య హక్కులకోసం చీనా ప్రజలు జరిపే పోరాటం మహత్తరమైన విజయాలు సాధిస్తుంది 1946 లోని విజయాలను మించి

సాధించుతారు. అప్పుడు శాంతిని నెలకొల్పడానికి అవకాశాలు లభిస్తాయి.

**అమెరికాను గురించి ఇలా అన్నాడు: "అమెరికా ఐశ్వర్యము తాత్కాలికం మాత్రమే. అమెరికా సామ్రాజ్యవాదం అగ్ని పర్వతం మీద కూర్చున్నది. ఆర్థిక క్లేశం అమెరికా సామ్రాజ్యవాదుల ముందున్నది."**

— 1947 మావు పార్టీ రిపోర్టు
చైనా పరిస్థితి

మావ్ ఎంత ఖచ్చితంగా మాట్లాడుతాడో అంతా ఆచరణలో పెడతాడు.

"జంగ్-కై షేక్ అభివృద్ధి నిరోధక యుద్ధం ప్రారంభించినప్పటినుండీ అతనిని ఓడించితీరాలని అన్నాం అంతేకాదు. ఓడించగలమని చెప్పేవారం చీనా జాతీయస్వాతంత్ర్యాన్ని హరించడానికి చీనా ప్రజలను దాసులను చేయడానికి అమెరికను సామ్రాజ్యవాదుల ఆధ్వర్యాన జంగ్-కైషేక్ విప్లవప్రతీఘాత యుద్ధాన్ని చేస్తున్నాడు. జంగును మనం ఓడించి తీరాలి.

ఈ మాటలు 1947 సంవత్సరంలో పార్టీకి యిచ్చిన రిపోర్టులో చెప్పాడు. మావ్ చెప్పినట్లే నేడు జంగ్‌ను ఓడించాడు. అమెరికా సామ్రాజ్యవాదుల ఆశలు నిరాశలు చేశాడు. వారి పెట్టుబడినంతా సముద్రం పాలుచేశాడు. ప్రజా విముక్తిసైన్యం ముందుకుసాగి పోతోంది. ఛూటే సేనానాయకత్వంక్రింద అడ్డేది ఎవరు? ఆటంబాంబులా? అవి ఏమీ చేయలేవు. కామ్రేడ్ మావో సేటుంగు మాటల్లోనే చదవండి

**"మార్క్సిజం, లెనినిజం జీర్ణించుకుంటే, ప్రజల్లో నమ్మకం ఉంచుకొని, ప్రజలతో నిలబడి వారికి నాయకత్వం వహించి నడిపితే, ఎంతటితీవ్రమైన అడ్డంకులనైనా దాటగలం. ఎంతటి కష్టములలోనైనా విజయం సాధించగలం. మన బలానికి ఎదురులేదు. ప్రపంచమంతటా సామ్రాజ్యవాదం పెట్టుబడిదారీ విధానం అంతం కాబోతున్న చారిత్రకసమయమిది. సోషలిజం ప్రజాస్వామ్య విజయానికి పురోగమిస్తున్న సమయమిది. విజయభానూదయం వెంటనే కాబోతున్నది. నడుములు బిగించండి!!"**

—"ఆనంద్"



# మలయా స్వాతంత్ర్యయోధుడు గణపతి

భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కార్యాలయం ఈ క్రింది పత్రికా ప్రకటన చేసింది:

"గతమాసంలో అఖిలమలయా ఫెడరేషన్ ట్రేడ్‌యూనియన్‌ల మాజీ అధ్యక్షుడూ గత సంవత్సరం ఢిల్లీలో జరిగిన ఆసియా దేశాల మహాసభకు మలయా ప్రతినిధి అయిన గణపతికి రివాల్వర్ దగ్గర ఉంచుకొన్నందుకు ఉరిశిక్ష విధించబడింది. సుప్రీమ్ కోర్టుకు అతడు చేసిన అప్పీలు నిరాకరించబడింది. కామ్రేడ్ గణపతిని ఉరితీశారు.

"కామ్రేడ్ గణపతి తంజావూరు జిల్లా తిన్నెత్తి పాండాలో ఒక పేద రైతు కుటుంబంలో పుట్టాడు. 12 సంవత్సరాల కిందట మలయాలో కూలీగా పనిచేయడానికి ఇండియాను విడచిపెట్టి వెళ్లాడు. అక్కడ మలయా రబ్బరు తోటల యజమానుల దారుణ దోపిడీని కండ్లార చూచిన తరువాత తన దేశ ప్రజలకూ, కార్మికులకూ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా ఎడతెగని పోరాటం జరపడంకంటె అతనికి వేరే మార్గం కనిపించలేదు. స్వాతంత్ర్యం కోసం, సోషలిజంకోసం మలయా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన సాయుధ పోరాటాన్ని సాగించట మొక్కటే ఏకైక మార్గమని గణపతి గ్రహించాడు.

"వెంటనే గణపతి కమ్యూనిస్టు పార్టీలో సభ్యుడుగా చేరాడు. జపాన్ ఆక్రమిత కాలంలో జపాన్ సామ్రాజ్యవాదులతో పోరాడాడు. యుద్ధం ముగిసిన తరువాత అఖిల మలయా లేబర్ ఫెడరేషన్ నిర్మాణంలో అత్యంత ప్రముఖపాత్రను నిర్వహించి, దాని ప్రధాన నాయకులలో ఒకడైనాడు.

"పట్టలిమురసు" అనే తమిళ కార్మిక వారపత్రికకు సంపాదకుడుగా పనిచేశాడు.

గత సంవత్సరంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదులు మలయా కార్మికులపైనా ప్రజలపైనా క్రూరంగా దాడిచేయడంతో కామ్రేడ్ గణపతి అజ్ఞాతవాసానికి వెళ్ళి పనిచేయడం ప్రారంభించాడు. అజ్ఞాతవాసంలో వుండగా పెద్దగా జబ్బుపడి నప్పటికీ మలయా ప్రజల సాయుధ విముక్తి పోరాటంలో వీరోచితంగా పాల్గొన్నాడు.

"అందుకనే అతడు జబ్బుపడి గత ఆరుమాసాలనుండి ఎలాంటి పనిచేయలేని స్థితిలో వున్నా (యీ విషయం గణపతి తన స్టేటుమెంటులో తెలిపాడు) సామ్రాజ్యవాదులు కక్షతో కామ్రేడ్ గణపతి ప్రాణాన్ని అమానుషంగా తమ పొట్టను పెట్టుకోడానికి సిద్ధపడ్డారు.

"భారత కార్మికవర్గం, దాని పార్టీ కమ్యూనిస్టుపార్టీ కామ్రేడ్ గణపతి గౌరవార్థం అరుణపతాకాన్ని 'దింపి' విప్లవ జోహారు లర్పించుతోంది. ఏనాటికైనా కామ్రేడ్ గణపతిని అమానుషంగా చంపిన ఖూనీకోరుల పనిపడతామని మలయా శ్రామిక ప్రజలతోపాటు శపథం చేస్తున్నది."



# అఖిలభారత అభ్యుదయ రచయితల ఐదవ మహాసభలో

# చర్చనీయ ప్రణాళిక

[1949 మే 26-30 తేదీలలో బొంబాయిలో జరగబోయే అఖిలభారత అభ్యుదయ రచయితల ఐదవ మహాసభలో ప్రవేశపెట్టబడనున్న చర్చనీయ ప్రణాళికను ఈ దిగువ ప్రకటిస్తున్నాం. ఈ ప్రణాళిక యు. పి. అభ్యుదయ రచయితల మహాసభలో ఆమోదించబడింది. ఈ ప్రాతిపదిక పై చర్చించి, అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘ ప్రణాళికను రచించడంలో ఆంధ్ర అభ్యుదయ రచయిత లందరూ తోడ్పడాలని కోరుతూ ఆంధ్రశాఖా కార్యదర్శి శ్రీ ప్రయాగ కోదండ రామశాస్త్రిగారు ఒక విజ్ఞప్తి చేశారు.

బొంబాయి మహాసభలో జాతీయ భాషా సమస్యకూడా చర్చించబడుతుంది. — సంపాదకవర్గం]

"ప్రపంచ చరిత్రలో అత్యంత క్లిష్టపరిస్థితుల మధ్య అభ్యుదయ రచయితలమైన మనం మహాసభ జరుపుకుంటున్నాం. యూరప్ ఆసియా ఖండాలలోని ప్రజల విజయ పరంపరను నిరోధించాలని శాస్త్ర సంస్కృతులకు బద్ధశత్రువులైన అభ్యుదయ నిరోధకులు నానాటికీ తమ శక్తులను సమీకరించుకొంటున్నారు. ఫాసిస్టుల పతనానంతరం పెంపొందుతున్న ప్రజాస్వాతంత్ర్యోద్యమాలను చూసి భయకంపితులవుతున్నారు సామ్రాజ్యవాదానికీ వలస విధానానికీ, ధానిసత్వానికీ, పరపీడనకూ, దోపిడికీ స్వస్తిచెప్పిన దేశాలలో ప్రజానీకం సాధించిన వైజ్ఞానిక విజయాలనూ, శాస్త్ర పురోభివృద్ధినీ చూసి గంగవెర్రులెత్తుతున్నారు. అందువల్లనే, కళావేత్తలనూ సాహితీపరులనూ అణచివేసిగానీ, ఒత్తిడి చేసిగానీ, భయపెట్టిగానీ, చిల్లర డబ్బుతో కొనుక్కొనిగానీ— వారిద్వారా జాతీయ దురహంకారాన్నీ, ఛాందసత్వాన్నీ ప్రచారం చేయించాలని చూస్తున్నారు.

"భారత దేశంలోకూడా, ఆంగ్లో అమెరికన్ ముత్రాక్రిందవున్న దేశాల్లో లాగానే, అభివృద్ధి నిరోధకులు దుష్టశక్తులకు దోహద మివ్వటమేకాకుండా, ఫాసిస్టు విషబీజాలను వెదజల్లుతున్నారు. అమెరికన్ సామ్రాజ్యవాదం, తన దేశంలో పౌరసత్వాలనూ అభ్యుదయ సారసత్వాన్ని అణచివెయ్యటమేకాదు, తన ప్రపంచాధిపత్యంకోసం ఇతర దేశాల అంతరంగిక వ్యవహారాల్లోకూడా జోక్యం కలిగించుకొంటున్నది.

"ఆసియా దేశాల్లో ఫాసిస్టు పద్ధతులను అవలంబించిన పాలకులు జాతి విద్వేషము రెచ్చగొట్టి అభ్యుదయ కాముకులైన శాస్త్రజ్ఞులనూ కళాకారులనూ వేటాడుతున్నారు. మానవజాతి పాలిటి మహాప్రసాదంగా వినియోగపడవలసిన శాస్త్ర విజ్ఞానాన్ని రహస్యంగా మారణాయుధాలు తయారు చెయ్యటానికి వినియోగిస్తున్నారు. ఈ దేశాల్లోని బూర్జువా సంస్కృతి అంత్యదశలో వుంది. పతనమైపోతున్న పాలకవర్గాల రక్షణకోసం మళ్ళీ ఆ సంస్కృతిని పునరుజ్జీవింప జెయ్యాలనే వాళ్ళ ప్రయత్నాలన్నీ విఫలంకాక తప్పవు.

"ఈ ప్రపంచాభ్యుదయ నిరోధక శక్తుల సమైక్యత మార్షల్ పథకంలోను, పశ్చిమ రాజ్యాల కూటమిలోను, అట్లాంటిక్ సంధిలోను, ఆలోచనల్లో వున్న పసిఫిక్ సంధిలోను స్పష్టంగా వ్యక్తపడుతున్నది. సోవియట్ యూనియన్ నాయకత్వాన ముందంజవేస్తున్న ప్రజాస్వామిక శక్తులను సవాలు చేస్తున్నది.

"ప్రపంచ పరిస్థితి ఇలావుండగా, భారతదేశంలోని అభివృద్ధి నిరోధకులు- పెట్టుబడిదార్ల యొక్క, ప్రభుత్వంలో వున్నవారి ప్రతినిధులయొక్కా నాయకత్వాన - ఆంగ్లో అమెరికన్ సామ్రాజ్యవాదులతో చేతులు కలిపారు. ప్రపంచ ప్రజాస్వామ్య శక్తుల పురోగమనాన్నీ, చైనా జనసామాన్యం సాధించిన అఖండ విజయాలనూ, ఆగ్నేయాసియాలోనూ- భారత దేశంలో కూడా - ఉవ్వెత్తుగా లేస్తున్న ప్రతిఘటనోద్యమాలనూ చూసి వీరు భయభ్రాంతు లవుతున్నారు. మన దేశానికి వచ్చిందనుకున్న 'స్వాతంత్ర్యం' అశేష జనసామాన్యానికి మాత్రం పాత నిరంకుశత్వంగానే పరిణమించింది - అదే దోపిడి, అవే బానిస సంకెళ్ళు.

"దేశంలో వున్న తీవ్రమైన ఆర్థిక సంక్షోభాన్ని ఎదుర్కోటానికి భారతీయ పాలక వర్గాలు ఆంగ్లో అమిరికన్ యుద్ధోన్మాదుల శరణు జొచ్చుతున్నారు. బ్రిటిష్ కామన్వెల్తులో భారత దేశపు భాగస్వామ్యంలోని అంతరార్థం ఇదే.

"పెట్టుబడిదార్ల స్వాధీనంలోని పత్రికలద్వారా, రేడియోలద్వారా, సినిమాలద్వారా అభివృద్ధి నిరోధక శక్తులు ఒకవంక సంఘటితపడుతూ వుండగా, అభ్యుదయ రచయితలు ఉపేక్షించి ఊరుకోరు. పౌరసత్వాలను అణచివెయ్యటాన్నీ అభ్యుదయ పత్రికలను నిషేధించటాన్నీ, ప్రజలకు నిజం చెప్పటం కంటే మరే నేరమూ చెయ్యని అనేక మందిని విచారణ లేకుండా నిర్బంధించటాన్నీ అభ్యుదయ రచయితలు సహించలేరు. ఈ నిరంకుశ విధానం మన దేశంలో సంస్కృతి వికాసానికి, శాస్త్ర పురోభివృద్ధికి అశనిపాతం వంటిది.

"సోవియట్ నాయకత్వాన పురోగమిస్తున్న ప్రపంచ ప్రజాస్వామ్య శక్తులు

ఈనాడు కూడా సామ్రాజ్యవాద శక్తుల కంటే బలవత్తరంగానే వున్నాయి. సకాలంలో సంఘటిత పడినట్లయితే అభివృద్ధి నిరోధక తత్వాన్ని సమూలంగా నాశనం చెయ్యగల స్థితిలోనే వున్నాయి. అందువల్ల రోమ్లో, న్యూయార్క్, పారిస్ సమావేశాల ద్వారా శాంతి సంస్కృతుల రక్షణ కోసం ప్రపంచాభ్యుదయ శాస్త్రజ్ఞులూ కళాకారులూ చేస్తున్న మహత్తర ప్రయత్నాలను అభినందిస్తున్నాం. వారితో భారతాభ్యుదయ రచయితలమైన మనం మన ఏకత్వాన్ని ప్రకటిస్తూ, శాంతికోసం ప్రజాస్వామ్య సంస్కృతీ నిర్మాణం కోసం శక్తివంచన లేకుండా కృషి చేస్తామని ప్రతిజ్ఞ చేస్తున్నాం.

"ఈ క్లిష్ట పరిస్థితుల్లో అభ్యుదయ రచయితల కర్తవ్యం:

1. అభివృద్ధి నిరోధకశక్తుల నిజస్వరూపాన్ని బయట పెట్టటం-

2. జాతీయ దురహంకారాన్ని ఛాందసత్వాన్ని తీవ్రంగా ఖండించటం-

3. ఒక సంస్కృతిపైమరోసంస్కృతి, ఒక భాషపై మరో భాష చేసే దాడిని ప్రతిఘటించటం—

4. శాంతి సంస్కృతులకు ఆగర్భ శత్రువులైనవారిని తుడిచిపెట్టేందుకుగాను అన్ని జాతులయొక్క స్వేచ్ఛాసమత్వాలను అభిలషించే వారందరినీ సమీకరించటం—

5. కార్మిక కర్షక ప్రజానీకం మీద పాలకవర్గం చేసే దౌర్జన్యాన్నీ పౌరస్వత్వాలను అణచి వెయ్యటాన్నీ ముక్తకంఠంతో ఎదుర్కోటం—

అభ్యుదయ రచయితలందరూ తమ సంఘాన్ని బలపరచుకొని, తమకర్తవ్యాన్ని నిర్వహించ వలసిందిగా ఈ మహాసభ కోరుకున్నది."

## సవరణలు

'భారతరాజ్యాంగ పరిషత్తు' అనే వ్యాసంలో 19వ పేజీ 6వ పంక్తిలో 'జాతీయం చేయడం జరగదని' ఉంటానికి బదులు 'జాతీయంచేయడం జరిగిందని' అచ్చుతప్పు దొర్లింది.

2 క్రిందటి సంచిక (14) లో ప్రపంచశాంతి మహాసభకు కామ్రేడ్ మహమ్మద్ బక్షీ హాజరైనట్లు ప్రచురించబడింది. ఇది పొరపాటు. భారతప్రభుత్వం ఆయనకు కూడా ప్యాస్‌పోర్టు ఇవ్వనందున ఆయన తన ఉపన్యాసాన్ని మాత్రమే శాంతిమహాసభకు పంపగలిగాడు. భారత ప్రజావాణిని ప్రతిబింబించిన ఆ ఉపన్యాసపాఠం శాంతిమహాసభ ప్రతినిధులందరకు అందించబడింది.

# India from Primitive Communism to Slavary

By S. A. DANGE

An outline of Indian History from the Primitive Communist stage to Slavary - to the end of Mahabharat War.
An indispensable book fot all Marxists.

Cheap Edition **Rs. 2-0-0** Library Edition **Rs. 4-8-0**

POSTAGE EXTRA

**People's Publishing House Ltd. : Bombay 4**

## CROSS ROADS

Editor :
ROMESH THAPER

A Progressive News Week y

Sub. Rates :
Rs. **12**/- year, Rs. **6**/- 6 mon.
Rs. **3**/- 13 weeks; Copy As **4**/-

**Contributors :**

Prof. C N. Vakil
Clifford Odets
John Hasted
Robert Joyce
Mulk Raj Anand
Pablo Neruda
Sean o' Casey
Maurice Dobb
Bal Raj Sahani
Vikram Ajit

**Artists :**

Dan Kaemer
Gorey
Ravin
Gropper
Kerala Varma
S. Wassoodev

Address :
**P.O.B. 4062, Bombay 7**

## MARXIST MISCELLANY

A theoretical journal published by

**Peoples' Publishing House Ld.**
**BOMBAY 4**

Price: Single Copy As. 8/-

### Contents in the 1st Number

1. Review of the Draft Constitution of India.
2. Marxist theory of Classes and Calss struggles

   by P. Fedoseyey

   (Editor - in - Chief of "Bolshevik")
3. Report to the Unity Congress of the Worker's parties of Poland

   by Boleslaw Bierut

Edited, Printed & Published by G. Venkateswara Rao-Guntur, Printed at Kavitilaka Press, Vijayawa



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M115 |
| పుస్తకం పేరు | జనత |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | NAVA |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Chaitanya |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |